ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ




# తెలుగు వచన వికాసము


రచయిత :

డాక్టర్ యం. కులశేఖరరావు









ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# తెలుగు వచన వికాసము



రచయిత :

డాక్టర్ యం. కులశేఖరరావు




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# ముందుమాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిది. బౌద్ధపూర్వయుగం నుంచి ఇటీవల బ్రిటీష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తున్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంత ర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏ కోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్థ్రమైన భావసమైక్యతకు ప్రాతి పదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిదేశాలనుంచీ, వివిధ రాష్ట్రాల నుంచి, యునెస్కొవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులు గానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభలసమయంలో

చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతుంది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని/మ్యూజియంను/ స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచిలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలనుప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు

అధ్యక్షులు

ప్రపంచ తెలుగు మహాసభలు.

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతి నిధులందరును ఒక చోట సమావేశమగు వసతిని కల్పించుటకై '1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాష స్రాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్నిలఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి. ఆ కార్య నిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్యుత్ సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్‌సంఘము ఆ లఘు గ్రంధముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగవిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రిక విషయములకు పంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు వహాసభాకార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ తెలుగు వచన వికాసము అను గ్రంథమును, రచించిన డాక్టర్ యం. కులశేఖరరావుగారు ఆంధ్ర పాఠక లోకమునకు సుపరిచితులు వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన ప్రోగ్రెసివ్ ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

దేవులపల్లి రామానుజరావు

కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాదు,

తేది 30-3-75

# వి ష య ము లు

# తెలుగు వచన వికాసము

## ఆంధ్ర వచనము :

ప్రపంచంలోని ఏ భాషలోనైనా, సాహిత్యము, గద్యము పద్యము, అనే రెండు శాఖల్లో విస్తరించి ఉంటుంది. సామాన్యంగా, గద్యంకంటె ముందే పద్యం లిఖితం కావడం, ప్రచారాన్ని చెందడం సంభవిస్తుంది. ఛందస్సు, లయ మున్నగుణాలీ సౌకర్యాన్ని పద్యానికి సమకూర్చినాయని చెప్పవలె. గద్యము ఛందో రహితం కావడం చేతను, ఆకర్షణ లేనిది కావడం చేతను పద్యంతో పోల్చి చూచినప్పుడు కొద్ది తక్కువ ప్రచారాన్ని కలిగి ఉంటుందనేది యథార్థం. అయినప్పటికీ, పద్యం కంటే గద్యము అల్ప శక్తి కలిగింది మాత్రం కాదు.

ఛందో రహితమైన వాక్య రచనకు సంస్కృతంలో గద్యమనియే వ్యవహారము. కాని, తెలుగులో వచనము, గద్యము అని సమానార్థకాలుగా ఉపయోగిస్తున్నాము. గద్యము అనే దానికి పర్యాయ పదంగా వచనము అనే తెలుగులోని ఉపయోగం, మన సోదర భాష అయిన కన్నడం నుంచి వచ్చింది. బసవేశ్వరుడనే శైవమతాచార్యుడు ఆ భాషలో 'షడ్స్థల వచనములు' 'కాలజ్ఞాన వచనములు'అనే ఛందో రహిత వచనాలను రచించినాడు. ఈతని అనుయాయులైన అక్క మహాదేవి, దేవర దాసమయ్య అనేవారు కూడ 'వచనములు' అనే రచనలు చేసి ఉన్నారు. ఈ రచనలకు ఆ భాషలో బహుళ ప్రచారం లభించింది. దీని ప్రభావం చేత, తెలుగులోని గద్య రచనలకు వచనము అనే పేరు వచ్చింది. ఆంధ్ర మహాభారత రచయితల్లో అగ్రగణ్యుడు అయిన తిక్కన సోమయాజి తన విరాట పర్వపీఠికలో ఇట్లు ప్రస్తావించినాడు.

"కావున భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాం
ధ్రావళి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్కృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్".

ఈ కవియే నిర్వచనోత్తర రామాయణ పీఠికలో ఒక పద్యం ఈ విధంగా వ్రాసినాడు.

"వచనము లేకయు వర్ణన రచియింపఁగఁ గొంతవచ్చుం బ్రౌఢులకుఁ గథా
ప్రచయము బద్యములన పొందు చితంబుగఁ జెప్పుటార్య లొప్పిదమనరే"

ఇది చూడగా, తిక్కన సోమయాజి కాలమునాటికి గద్యము, వచనము అనే పదాలు సమానార్థకాలుగానే ఉపయోగింబడుతూ ఉండేవని నిర్వివాదంగా చెప్పవచ్చు. క్రీ. శ. 16వ శతాబ్దానికి చెందిన ప్రఖ్యాత ఆంధ్ర లక్షణకారుడు అనంతామాత్యుడు తాను రచించిన ఛందోదర్పణంలో, ఈ విధంగా వ్రాసినాడు.

"కనుగొనఁ బాదరహితమై-పనుపడి హరిగద్దెవోలె బహుముఖ రచనం
బున మెరయు గద్యమదిదాఁ-దెనుఁగు కృతుల వచనమనఁగ దీపించకడున్"

సంక్షిప్తంగా నిర్వచించినా, అనంతామాత్యుని అభిప్రాయం అనేక విశేషాలను తెలుపుతూ ఉన్నది. ఇతడు గద్యమంటే ఏమిటో చెప్పుతూ ఉన్నాడు. గద్యము 'పాదరహితం'గా ఉండవలెనట. ఇది సంస్కృతంలో విద్యానాథుడు చెప్పిన 'అపాదః పదసంఘాతో గద్యమ్'అనే దానికి సరిపోయింది. అనగా, ఛందోరహితమైన వాక్యరచనను గద్య మనడంతో అనంతామాత్యుడేకీ భవించినాడు. ఇక 'హరిగద్దెవోలె బహుముఖ రచనంబున' గద్యము మెరయ వలె. హరిగద్దె అంటే ఆదిశేషుడు. అతనికి సహస్ర ముఖాలున్నాయి. గద్య రచన నిశ్ఛందమైంది కాబట్టి బహు విధాలుగా నడువవలె. అంటే, నియమిత పరిమితి గద్య రచనకు ఉండకూడదు. బహుముఖ రచన అనడంలో వేరొక అర్థం కూడ స్ఫురిస్తుంది. గద్యము పలువిధాలైన శైలితో, వైవిధ్యం కలిగి ఉండవలె. వృత్తగంధాది రచనారీతులిందుండ వలె. ఆదిశేషునికి పాదాలు లేనట్లే గద్యానికి నియమిత పాదాలు (నియమిత గణాలు) లేవు. ఇటువంటిదే గద్యమని అనంతుని అభిప్రాయము. ఈ గద్య లక్షణము సంస్కృతానికి కూడ సరిపోతుంది. ఇట్టి రచన తెలుగులో చెప్తే, దాన్ని వచన మనవచ్చునని యితడు చెప్పినాడు. దీనివల్ల క్రీ. శ. 16వ శతాబ్దం నాటికి ఛందోరహితమైన వాక్యరచనకు వచనమని తెలుగులో పేరేర్పడినదని స్పష్టమవుతుంది. ఇదే విషయాన్ని అప్పకవి [illegible]

"ధరసాహిత్యము గద్య పద్యములనం దారెండు భేదంబులై
పరగున్, గద్యమునందు బాదనియతుల్ భావింపఁగా లేవు. నా
కన్న పరణంబై విలసిల్లగా నుడువ నొప్పున్ గావ్యమింతేనియున్
మరుతంద్రి, మఱిదీనికే వచన నామంబయ్యె నాంధ్రంబునన్"

ఒక విధంగా అప్పకవి అనంతామాత్యునితో ఏకీభవిస్తున్నట్లుగా ఈ పద్య మూలంగా తెలియ వస్తున్నది. కందుకూరి వీరేశలింగంగారు చెప్పిన ఈ కింది వాక్యాలను ఉద్ధరించి, యిక ఈ అంశాన్ని ముగించవచ్చు.

"రమారమి నలువది సంవత్సరముల క్రిందట తెలుగులో గద్య కావ్యములు లేవు. అప్పుడు చిన్నయసూరి వ్యాకరణమును రచించి యందులకు లక్ష్యముగా నీతిచంద్రికను వచనమున వ్రాసెను" దీనివలన వీరేశలింగంగారు గద్య వచన పద్యాలను సమానార్థకాలుగా ఉపయోగించినారనేది స్పష్టమే కదా.

## ఉత్పత్తి - వికాసము :

ఆంధ్ర వచనము ప్రధానంగా మూడు శాఖల్లో వికాసాన్ని పొందింది. 1. ప్రాఙ్నన్నయ యుగం నుంచి, నాయకరాజుల యుగం వరకు, ఆయా వంశాల రాజులు ప్రకటించిన శిలాతామ్ర శాసనాలు. 2. చంపూ కావ్యాలు. 3. వచనైక రచనలు. ఈ మూడు విభాగాల్లో, విస్తరిల్లిన వచనాన్ని గురించి ఇపుడు చెప్పవలసి ఉన్నది.

## శాసనాలు :

ప్రాఙ్నన్నయయుగానికి చెందిన రాజవంశాల్లో రేనాటి చోళులు ముఖ్యమైనవారు. వీరు తెలుగులో శాసనాలు ప్రకటించి ఉన్నారు. వీటిలో తెలుగు వచన రచన కనిపిస్తున్నది. మనకు లభించిన తెలుగు శాసనాల్లో గద్య శాసనాలే మొదటివి. రేనాటి చోళుల శాసనాలకు ఉదాహరణగా దీన్ని చెప్పవచ్చు.

"చోళ మహారాజుల్లో ఏళ ఎరిగల్ తుకరాజుల్లో యిచ్చిన పన్నాస. రాచమానంబున ఏబది తిరువుళ పాఱకు ఇచ్చిన పన్నాస. దీనికి వక్రంబు

వచ్చినవారు పంచ మహాపాతక అగు" (చోళ మహారాజు ఉరుటూరు శాసనము క్రీ. శ. 7వ శతాబ్ది)

ఇది తెలుగు వచనమున ఉత్పత్తిదశ అని చెప్పవచ్చు. రచన ప్రాథమికంగా ఉన్నప్పటికి, ఒక ప్రయోజనవంతమైన అర్థం దీనిలో స్ఫురిస్తున్నది.

రేనాటి చోళుల తరువాత, ఈ శాసనాల్లో చాళుక్య రాజుల శాసనాల్లోను ఆంధ్ర వచనం, చక్కని స్థానాన్ని సంపాదించింది. ఈ శాసనాల్లో చాళుక్య భీముని కొరవిశాసనాన్ని ప్రధానంగా పేర్కొనవలె. ఇది క్రీ శ. 9వ శతాబ్దానికి చెందింది. దీనిలో వాక్యరచన ఈ విధంగా ఉంటుంది.

" శ్రీ విక్రమాదిత్య నృపాగ్రతన యుణ్డయ్ను చాళుక్య భీమునకు, కౌచకణ్ధపున్నకు వేగీశ్వరునకు, రనమర్ద్దాన్వయ కుల తిలకుణ్డయ్ను కుసుమాయుధుణ్డుగన్న... ............ రాజ్యంబు సేయుచు విష్టవిషయ కామోప భోగంబుల ననుభవించుచు సుఖంబుణ్డ యొకనాణ్డు కొరవి నల్లజెరియ కొడుకు పెద్దన రావించి, నీవు నా ప్రాణ సమానుణ్డవైన చెలివి............"

ఈ వాక్య విన్యాస వైఖరి పరిశీలించగా, ఇది క్రీ. శ. 11వ శతాబ్దమున వెలువడిన ఆంధ్ర మహా భారతంలోని వచనానికి సమీపంగా కన్పిస్తుంది. అయినా, ఇట్టి వాక్య రచనాక్రమంగాని, భావపరిపూర్ణతగాని, చోళ చాళుక్య శాసనాల్లో సార్వత్రికం కాదు. ఈ యుగ శాసనాల్లోని వచనాన్ని గురించి, స్థూలంగా ఈ విశేషాలు చెప్పవచ్చు.

1. పదాల్లో ప్రాకృత భాషా ప్రభావం ప్రస్ఫుటంగా ఉండడం.
2. వాక్య నిర్మాణక్రమం పరిపూర్ణంగా లేక పోవడం.
3. అనేక సందర్భాల్లో సమాపక క్రియలు లేక పోవడం.
4. ఈనాడు ప్రచారంలో లేని అనేక పదాలు ఆ శాసనాల్లో కనిపించడం.
5. శకటరేఫము, ఱ, ఌ, అనే అక్షరాలు ఉపయోగింపబడటం.

మొత్తం మీద ఈ శాసనాల్లోని వచన రచన ఆంధ్ర మహా భారతంలోని వచన రచనకు పూర్వరంగంగా ఉండింది అనడం సమంజసంగా ఉంటుంది.

చోళ చాళుక్య యుగానంతరం ఆంధ్ర దేశంలో వెలువడినవి కాకతీయుల శాసనాలు రాజవంశంవారు వేయించినవి, సామంత మంత్రి దండనాథులు వేయించినవి, వీటిలో ఉన్నవి. రేచెర్ల వంశంవారు వేయించినవి కూడ ఈ యుగంలోని శాసనాల్లోనే చేర్చవలసి ఉన్నది. ఈ శాసనాలు వెలువడే నాటికి, ఆంధ్ర భాషలో విశేషమైన పరిణామం కలిగింది ప్రథమాంధ్ర మహాకావ్యమైన మహా భారతం అప్పటికే తెలుగులో వెలువడింది. నన్నెచోడుడు మొదలైన వారు రచించిన కావ్యాలు కూడ అప్పటికే ప్రచారాన్ని పొందినాయి. ఇట్లు సాహిత్యకంగా, ఆంధ్ర భాషకు ఒక పరిణతదశ ఏర్పడింది. ఇంతకు పూర్వం ద్రవరూపంలో ఉన్న అంధ్రభాష, గ్రంథస్థమైన సాహిత్యాన్ని సంతరించుకొని ఘన రూపాన్ని పొంది ప్రామాణ్యాన్ని అందుకొన్నది. ఆ విశేష వాతావరణమును రూపొందించుకొన్న తెలుగుభాష కాకతీయ యుగ శాసనాల్లో నిబద్ధమైంది. అందుచేత, ఈ శాసనాల్లోని తెలుగు వాక్య రచనా పద్ధతి కాని, వచన రచనా విశేషాలు కాని ప్రాథమికంగా కాన్పించవు ఇదివరకు తెలుగు పదాల్లో ఉండే ప్రాకృతభాషా ప్రభావం, ఇప్పుడు పరిపూర్ణంగా అదృశ్యమైనదనే చెప్పవలసి ఉంటుంది. ఆంధ్ర మహాభారతం గద్య పద్య మయమైన చంపూ కావ్యంగా వెలువడి ఉండడంచేత కాబోలు. ఈనాటి శాసనాల్లో అధికాంశం అదే పద్ధతిలో రచితమైనాయి. ఈ పద్ధతికి ఉప్పరపల్లి ఈ శాసనాన్ని ఉదహరించవచ్చు.

"స్వస్తి శ్రీమదపార పారావార పరివృత మహీతలంబున సకల వినుతంబగు నాంధ్ర దేశంబునకు విభూషణంబైన యనుమకొండ యను పురవరంబు నిజ రాజధానిగా నొప్పుచున్న కాకతి భూపాలక్రమంబున జనవినుత యశో విశాలుండునైన రుద్ర పుత్రుడును, పదారాధితత్రినేత్రుండును విబుధ జనవసంతుండును, రమణీయ సీమంతినీ వసంతుడును, సకలజన మనోరంజకుండును, నరాతి రాజమదభంజనుండును, శరణాగత రాజ శరణ్యుండును, విమతాఖిల రాజ వరేణ్యుండును, ధైర్యామరసానుమంతుండును, దురగరేవంతుడును, సత్య హరిశ్చంద్రుండును, విభవామరేంద్రుండును, నైన గణపతి దేవ మహీనాథునకుం బ్రధానియై.

కనకాచలధీరుడు జన - వినుత చరిత్రుండు గార్యవిదుం
డినతేజుడు గుణనిధి బెజ్జమ-తనయుండు బుధధీన భానుతనయుండనగాన్

ఉ॥ ప్రతిపక్ష క్షితిపాల కుంజర మద ప్రారంభ సంరంభ మ
ద్ధతబాహా నిహితప్రచండ నిశితోద్యత్ఖడ్గధారానఖా
హతి భేదించి యఖర్వ గర్వబల శౌర్య స్ఫూర్తిగంభీరవాస్న
కృతియై సన్నుత వృత్తిదాల్చి తెలిసెన్ రేచెర్ల రుద్రుండిలన్

సకల వినుత యశుండును, గుణగణాలంకారుండును, నైన కాట్రెడ్డికి సౌందర్య సౌభాగ్య చాతుర్యంబులు గలిగి పరగిన పరమ పతివ్రతమైన బెజ్జమాంబకుం బ్రియనందనుండును, ననవరత ధర్మ సమేతుండును, పతిహిత చరణుండును, గాకతి రాజ్య భార ధౌరేయుండును, సద్గుణ ప్రఖ్యాతుండును, నతుల బలపరాక్రమ సమన్వితుండును, నైనరేచెర్ల రుద్రునకుం బ్రధాని

క "కులతిలకుండు వసుధామర జలధి సుధాకరుండశేషజన నుతచరితుం
డలఘుండు రిపుతరు దావానలుం డనగాబరగె రాజనాయకు డుర్విన్"

( Hyderabad Archeological Series No. 3 )

ఇదే చంపూ పద్ధతిలో ఈ శాసనమంతా రచితమైంది. ఇటువంటి వాక్య రచన, వచన రచన కలిగిన శాసనాలు అనేకంగా ఈ యుగంలో వెలువడినాయి. కాకతీయ యుగ శాసనాల్లోని వచన రచనము గురించి, ప్రధానంగా ఈ అంశాలను పేర్కొనవలె.

1. ప్రాకృత భాషా రాహిత్యం.
2. భావం విశదంగా ఉండి, అస్పష్టత ఎచటనూ కాన్పించకపోవడం
3. పరిపూర్ణ వాక్య విన్యాసక్రమం.
4. వైవిధ్యం కలిగిన వచన రచనాపద్ధతి - ఇది ఆంధ్ర మహాభారత ప్రభావంచేత ఏర్పడిన విశేషము.
5. మాండలిక పదప్రయోగాలు (బుసి ఖండాలు, మసి ఖండాలు మొ॥)
6. అచ్చటచ్చట వ్యావహారిక వాక్య రచనము. ('వానికి అనేక బ్రహ్మ కల్పాలు నరకములు. జగిరానకూ, దీపానకూ మూడు మర్తురు' వంటివి).

కాకతీయుల తరువాత ఆంధ్రదేశాన్ని కొండవీడు, అద్దంకి, రాజమహేంద్రవరం అనే నగరాలను రాజధానులుగా జేసికొని రెడ్డిరాజులు పరిపాలించినారు. ఈ రాజులు ఆయా సందర్భాలను పురస్కరించుకొని, శాసనాలను ప్రకటింపచేసిరి. ఈ శాసనాలకు తెలుగు వచనంతో సంబంధం ఉన్నది. కాబట్టి ఈ సందర్భంలో వాటిని ప్రస్తావించవలసి ఉంటుంది. ఈ శాసనాలు క్రీ. శ. 14, 15 శతాబ్దుల్లో వెలువడినాయి ఈ శాసనాల్లోని వచనాన్ని ప్రదర్శించడానికి ఆ కాలపు శాసనాలకు ప్రతినిధి ప్రాయంగా ఉన్న ఈ చీమకుర్తి శాసనాన్ని ఉదహరించడం సముచితంగా ఉంటుంది.

" శ్రీత్రిపురాంతకేశ్వర ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన వర్షంబులు ౧౨౫౭ అగు నేటి యువనామ సంవత్సర కార్తిక శు॥ ౧౨ గురు వాసరమన్వాది మహా పుణ్యకాలమునందు, యజుశ్శాఖాధ్యాయీ, ఆపస్తంభ సూత్ర కౌండిన్య గోత్రోద్భవులున్నూ, శ్రీ మద్యజనాది షట్కర్మ నిరతులగు కామేశ్వర భట్టారకుని వారి పౌత్రులున్నూ, కొన్డు భట్టారకుని పుత్రులున్నూ, చిట్టనమంచి తిమ్మన శాస్త్రులవారికి స్వస్తిశ్రీ సకల గుణాలంకార చంచుమల చూరకార విశ్వవిశ్వంభరాచరణ వహన దక్ష దక్షిణాభుజదండ జగనొబ్బ గండ అనియు, మండలీకరగండ రాయచేకోలు గండరాయ మీసరగండ అర్థి పత్రిత్యర్థి హేమాద్రిదాననిరత ప్రజాపరిపాలన చతురహరణభరణ రూప నారాయణ, వీరనారాయణ భుజబల భీమ, కోదండరామ, అపరిమిత భూదాన పరశురామ అనేక నగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహువిధారామ సంగడి రక్షపాలక, జగరక్ష పాలక, జగద గోపాలక, గుజ్జరిభట్ట విభాళ ఘనభుజవి రాజమార కరవాల రాచూరి దుర్గ విభాళ, జలదుర్గ జలధి బడబానల స్థలదుర్గహావన హాలాయుధ అనవరత పురోహిత సోమపాన, శ్రీ పర్వత అహోబల నిర్మిత సోపాన. దిక్కాంతా మనోహర కీర్తికుసుమామోద కుండిప్రభా సహ్యజా గౌతమా జలక్రీడావినోద కలింగరాయ మానమద మర్దన మన్నియరాయ మృగ వేంటకార, వొడ్డియరాయ నిర్ధూమధామ జంతుర్నాటరాయ హల్లకల్లోల అది రాయ బసవశంకర, విరోధి నృపదానవ నరసింహ పాండ్యరాయ గజసింహ, ప్రజ్ఞా చతుర్విధోపాయ, కేళాదిరాయ, నిత్య పరిపాలిత సత్యపల్లవాదిత్య రిపునరపతి గోధూమ ఘట్టన ఘరట్ట అప్పయగోపయ దిశాపట్టణ, సంగ్రామ

సముద్దండ చండభుజాసి విఖండిత కృతకీలాల ప్లవమాన, బ్రహ్మకుండి. కృష్ణ వేణీ గోదావరీ మహానదీ తతీద్వయస్మధ్య దేశానేకాగ్రహార అరణ్య పుణ్యక్షేత్ర సత్ర బహువిధ విహార, పూర్వసముద్రాధీశ్వర ఏకరాయ స్థాపనాచార్య ఏకసింహాసనాలంకార శ్రీమత్ త్రిపురాంతక దేవదివ్య శ్రీపాద పద్మారాధకులైన శ్రీమతు వేమయరెడ్డిగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసనం॥ మద్భుజాదండ పరిపాలనమైన సామ్రాజ్యమందు శ్రీశైల భూమిని అంమ్మన బోల్లి శీమలో రామతీర్థం సర్వాగ్రహారమున్ను, చీమకుర్తి భీమేశ్వర పులికొండ మైలవరం కొమారపురి గ్రామములు అయిదింటియందున్ను' వెలిపొలంలోనున్న, చర్వల క్రింది మాంగానిలోనున్న, ఆకుతోంటలు, చెఱకు తోంటలోను, భూమిచతుర్థాంశం సర్వమాన్యంగా నున్ను, మిగిలిన ముప్పాతిక భూమిని పండిన నానాఫలాదుల నున్ను, షోడశాంశం మేరకు సువర్ణాదాయనకు పంచమాంశమున్ను పెద్దచెరువు నీళ్లను యీ గ్రామాలుగాక యితర గ్రామాల పండిన ధాన్యానకు దశాంశమున్ను, శీమామూలం ప్రతి గ్రామములందున్ను పధారుచారల ఘడకు వెద్దవూరికి ఇన్నూరు కుంటలున్ను యీలాగు నిర్ణయంచేసి రామతీర్థం మొదలైన ఆరుగ్రామాదుల యందున్న, అష్ట భోగస్వామ్య స్వతంత్రములున్ను, చతుర్విధ యోగాంక సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగా యిప్పిస్తిమి గనుక ....................పారంపర్యమున్ను అందుల వచ్చిన ఫలం ...." చీమకుర్తి శాసనము. (ఎపిగ్రాఫికా ఇండికా 1921 PP 271-72).

ఈలాంటి సమగ్ర శాసనాలు తెలుగు వచనంలో చాల ఉన్నవి. ఈ శాసనాల్లోవి ప్రధాన లక్షణాలను ఈ విధంగా పేర్కొవలె.

1. ఇంతకు పూర్వం వెలువడిన శాసనాల్లోవలెనే, వీటిలోను వ్యావహారిక పద్ధతిలో వాక్యరచన ఉండడము. (గ్రామాలు, ఇప్పిస్తిమి, కుంటలున్ను మొ॥).

2. భావ వ్యక్తీకరణం సమగ్రంగా ఉండడము. పునరుక్తిరాహిత్యం.

3. పరిపూర్ణ వాక్య విన్యాసక్రమం.

4. విశిష్టమైన శబ్దాల మార్పు. ఆ విధంగా అనుప్రాసాది శబ్దాలంకార ప్రయోగం. (అనవరత పురోహిత కృత సోమపాన-శ్రీ పర్వత అహోబల నిర్మిత సోపాన మొ॥)

5. ఇంతకు పూర్వం వెలువడిన శాసనాల్లో లేని విశేష పద జాలాన్ని ఉపయోగించడం. (మన్నియ=ప్రభువు; పట్టా=భూమి; కుంట లేక గుంట =భూపరిమాణం; మొ॥).

రెడ్డిరాజుల శాసనాల తరువాత చెప్పదగినవి విజయనగర ప్రభువుల శాసనాలు. క్రీ. శ. 1336 సంవత్సరంలో హరిహరుడు, బుక్కరాయలు స్థాపించిన యీ రాజ్యం 1565 సంవత్సరంలో జరిగిన తాళికోట యుద్ధం వరకు కొనసాగింది. పరాక్రమవంతులు, సాహిత్య కళాపోషకులూ, అయిన అనేక సార్వభౌములీ మధ్య కాలంలో ఆంధ్రదేశాన్ని వైభవోపేతంగా పరిపాలించినారు. ఈ రాజులు స్వయంగాను, వారి అనుయాయులు అయిన సామంతదండనాథాది రాజకీయోద్యోగులూ, ఈ కాలంలో అనేక దాన శాసనాలను వేయించినారు. అదృష్టవశాన మనకీ యుగంలో ఏబదికి పైగా వచన శాసనాలు లభించినాయి. ఈ శాసనాలన్నీ, విషయాన్నిబట్టీ, భాషను బట్టీ సమగ్రంగా ఉన్నాయి. ఈకాలం నాటికి ఆంధ్ర భాషలో విస్తృతంగా గ్రంథ రచన జరగడం, భాషకు ఒక ప్రామాణ్య స్థితి రావడం దీనికి కారణాలు కావచ్చు. ఇతఃపూర్వం వెలువడ్డ శాసనాలకువలెనే, పెక్కు విజయనగర రాజ్య శాసనాలు వ్యావహారికంగా ఉండే వచనంలో ఉన్నాయి. ఈ శాసనాలను పండితులు మాత్రమే కాక, సామాన్యులు కూడ గ్రహించవలసిన అక్కర ఉండడం చేతను, శాసన రచయితలందరూ విశేష పాండిత్యం కలవారు కాకపోవడంచేతను, ఈ శైలి అమల్లోకి వచ్చి ఉంటుంది. ఈ శాసనాల్లో అనేకంగా అన్యభాషాపదాలు ఉపయోగింపబడడం, ఈ సందర్భంలో పేర్కొనదగిన విశేషాల్లో ఒకటి. సాదనః, జరగరు, మామూలు, దివాణము, రొఖ్ఖము, మక్తా, ఖరీదు మొదలగు పదాలను ఉదాహరించవచ్చు. ఈ పదాలన్నీ పర్షియన్, ఉర్దూ భాషల్లో వాడుకలో ఉండగా, ఆ భాషల్లో నుండి మన భాషలో ప్రవేశించినట్టివే. చారిత్రకంగా ఆనాడు ముసల్మానుల ప్రభావం సమస్త భారతదేశంతో పాటు ఆంధ్రదేశం పైన కూడ

ఉండడం వలన వారి భాషల్లోంచి శబ్దాలు మొదట జనవ్యవహారంలోను, తరువాత నాటివ్రాతల్లోను ప్రవేశించి ఉండవచ్చు. ఈ శాసనాల్లో, తెలుగు కావ్యాల్లో వలె చూర్ణికలు, ఉత్కళికాప్రాయాలు, ఒక్కొక్కసారి పద్యగంధులు అనే వచన వైవిధ్యాలు కూడ కనిపిస్తాయి. ఈ విశేషాలన్నిటికీ ప్రతిబింబంగా ఉన్న ఈ శాసనం ఉద్ధరించతగి ఉన్నది.

"స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబు ౧౪౪౦ అగు నేంటి బహుధాన్య సంవత్సర వైశాఖ శు॥ ౧౫ శ్రీమన్మహా రాజాధిరాజ రాజ, పరమేశ్వర శ్రీ వీర ప్రతాప శ్రీకృష్ణదేవ మహారాజులుం గారు పృథివీ రాజ్యం సేయుచుండగాను, సాళువ తిమ్మరుసయ్యం గారు మహా ప్రధానులై నడువంగాను, వశిష్ఠగోత్రం సూర్యవంశోద్భవులైన హంస బిరుదగండ సహకార బాంధవ మల్లికావల్లభాభరణ రంగభైరవ గండధనంజయ బిరుదాంకితులైన బెజవాడ దుర్గావరప్రసాదులైన మాధవవర్మ వంశోద్భవులైన కంఠమహారాజు గారి కొమారుండు...."

(South Indian Inscriptions. Vol. IV. No. 789)

వ్యావహారిక భాష తెలుగులో ఒక పరిణతిని పొంది పరిపూర్ణత్వాన్ని ప్రయోజనాన్ని, పొందడం విజయనగర యుగ శాసనాల్లో కాన్పించు ప్రత్యేకత.

ఆంధ్ర రాజులై ఆంధ్రేతర ప్రాంతాలను పరిపాలించిన నాయక రాజులు కూడ కొన్ని తెలుగు శాసనాలు వెలయించి వున్నారు. కాని, వీటి సంఖ్య స్వల్పంగా ఉన్నది. ఆంగ్ల నాగరకత ప్రభావం మనవారి మీద ప్రసరించడం చేతకాబోలు, పత్రి వ్యవహారానికి ప్రాచుర్యం వచ్చి, నాయక రాజుల కాలంలో శిలాతామ్ర శాసనాల ప్రయోజనం తగ్గిపోయింది. ఈ కాలంలో విజయరాఘవ నాయకుడు వేయించిన నమ్మిక శాసనం వెలువడింది. ఈ శాసనాన్ని శాసన ప్రకటన కర్త రజతపత్రంపై వ్రాయించినాడు. ఈ శాసనం ఇండోనీషియాలోని బటేవియా మ్యూజియంలో భద్రపరుపబడింది. ఇదికాక, విజయరంగ చొక్కనాధుని జంబుకేశ్వర శాసనం, మధుర మీనాక్షీదేవి శాసనం, అనేవి మాత్రమే లభిస్తున్నాయి. వీటిలో మొదట చెప్పిన నమ్మిక శాసనం, ప్రాచీన శాసన రచనా సంప్రదాయానికి భిన్నంగా ఉన్నది. ఒకానొక సందర్భంలో వచ్చివారికి వ్యాపార

నియమాలను విధిస్తూ, ప్రకటించిన శాసనమిది. నిజానికిది దానపత్రం కాదు. నమ్మికపత్రం (Agreement) మాత్రమే. దీనిలో విషయానికే ప్రాధాన్యం ఉన్నది. వోలందా, కుంఫునీ, పరంగి, మున్నగు అన్యభాషా పదప్రయోగం దీనిలోఉన్నది. ఇక ఆ తరువాతనైనా దాన శాసనాలు సంప్రదాయబద్ధమైన శాసనాలే. విజయనగర యుగ శాసనాల్లో గల సర్వపరిణత వచన లక్షణాలు వీటిలో ఉన్నవి. అందుచేత ప్రత్యేకంగా వీటిని గురించి చెప్పవలసిందంతగా లేదు. మొత్తం మీద వ్యావహారిక వచన రచనా పరిమాణానికి వివిధ కాలములలో వెలువడిన శాసనాలు ఆలంబనములైనాయి .వాటిలో ఆనాటి సాంఘిక రాజకీయ భాషా విశేషాలు స్పష్టంగా ప్రతిబింబిస్తున్నవి.



## ఆంధ్ర మహాభారతము-వచన రచనము :

కులశేఖర రావు, యం.

ఆంధ్ర పద్య విద్యకు వలెనే, సలక్షణమైన గద్యవిద్యకు కూడ ఆద్యుడు నన్నయభట్టు. తెలుగులో ఆదికావ్యమైన మహాభారతం చంపూ గ్రంథం. "గద్య పద్య మయం కావ్యమ్ చంపూరిత్యభిధీయతే" అనుదాన్ని బట్టి ఈ కావ్యంలో పద్యాలకు వలెనే, వచనములకు కూడ సముచిత స్థానం లభించింది. దీనిలో మూడింట రెండు వంతులు పద్యాలుండగా, మూడవ భాగం వచనమాక్రమించింది. ఈ వచనం కూడ పద్యాలకు తీసిపోయేదికాదు. ప్రత్యేక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని రచింపబడినట్టిది. కావ్యశిల్ప వైలక్షణ్యమును సంతరించు కొన్నట్టిది. కేవలం నన్నయ రచనలోనే 1431 వచనములున్నవి, వీటిలో కొన్ని సంక్షిప్తంగా ఉన్నమాట నిజమేమైనా, పెక్కు వచనాలు సముచితమైన దైర్ఘ్యాన్ని కలిగి కావ్యప్రయోజన సాధకాలుగా ఉన్నాయి. ఇక నన్నయభట్టు ఈ వచనముల వలన ఏమి ప్రయోజనాలను సాధించినాడు అనే విషయాన్ని పరిశీలింతాము.

ఆంధ్ర మహాభారత మితిహాస కావ్యం కావడంచేత, ఆయా సందర్భాల్లో వంశానుక్రమణికలు చెప్పవలసి వచ్చును. కావ్య రచనా విశారదుడైన నన్నయ ఇటువంటి సందర్భాల్లో వచనాలనే కూర్చుతూ ఉంటాడు. పద్యాన్ని రసవంతమైన ఘట్టాల్లో రచించడం మంచిదిఅని భావించేవాడు నన్నయ.

అందుచేత వచనములకు చక్కని ప్రయోజనాన్ని, కావ్యానికి ఔచిత్యాన్ని సమకూర్చినాడు.

మహాభారతంలో ప్రధానంగా కౌరవ పాండవుల కథ చెప్పవలసి ఉంటుంది. కాని ప్రసక్తాను ప్రసక్తంగా, ఉపాఖ్యానాలను కూడ చెప్పవలసి ఉంటుంది. ఈ ఉపాఖ్యానాలు అనబడే కథలు మహాభారతంతో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను, సంబంధం కలిగి ఉంటాయి. ఇవి సంఖ్యలో నూటఏబదికి పైగా ఉన్నాయి. వీటిలో కొన్ని దీర్ఘములైనట్టివి. నలచరిత్ర వంటిది వీటికి ఉదాహరణ మవుతుంది. ఇక సందర్భాన్నిబట్టి చిన్న కథలు కూడ చెప్పవలసి ఉంటుంది. ఇవి రమ్యమై రసవంతములై-నప్పటికి దీర్ఘములుగా. చెప్పవీలులేదు.. ఆ విధంగా చేస్తే ప్రధాన కథకు భంగం కలుగుతుంది. కావ్య శిల్పం విచ్ఛిన్న మవుతుంది. ఇటువంటి సందర్భాలలో కవి, సంక్షిప్తీకరణాన్ని ప్రధానంగా అవలంబించవలసి ఉంటుంది. ఇటువంటి వేళల్లో పద్యాన్ని గ్రహిస్తే దానికి పాదసంఖ్య నియమితం కావడంచేత సంక్షిప్తీకరణం జరగదని కాబోలు, నన్నయ వచనమునే గ్రహిస్తు ఉంటాడు. ఒక ఉదాహరణ ఈ అంశాన్ని స్పష్ట పరుస్తుంది. ప్రసంగవశాన వసురాజు కథను చెప్పవలసి వచ్చింది. ఈ కథ రసవంతమైంది కూడ. కాని ప్రధాన కథతో విశేష సంబంధం కలిగింది కాదు. అందుచేత దాన్ని సంక్షిప్తంగా చెప్పవలె. ఈ విషయాన్ని శ్రద్ధగా గమనించిన నన్నయభట్టు కేవలం ఆరు పంక్తుల వచనంలో దీన్ని సంక్షిప్తీకరించినాడు. పద్యాన్ని గ్రహిస్తే కనీసం నాలుగైదు పద్యాలు, అంటే 16–20 పంక్తులైనా కావలసి వచ్చేవి. కాని, వచనంలో ఇది అతిసంక్షిప్తంగా ఇమిడి ఒక ప్రయోజనం సిద్ధమైంది. ఆంధ్ర మహాభారతంలో, వచనంచేత ఇటువంటి ప్రయోజనాన్ని సాధించడం చాలచోట్ల చూడవచ్చు.

కవి కథను చెప్పేటప్పుడు కథనం చేయవలసి వస్తుంది. నన్నయగారూ, ఆయన తరువాతి మహాభారత కవులూ, కథనం చేసేపట్ల వచనమునే ఉపయోగిస్తూ వచ్చినారు. ఇది కాక, సంభాషణలు, అందును. చిన్నవి, చెప్పవలసికు చోటులలో నన్నయ వచనమునే ఉపయోగిస్తూ ఉంటాడు. దీనివలన కథకు నాటకీయత ఏర్పడుతుంది. గరుత్మంతుని కథలోని, కద్రూ వినతల యీ సంభాషణ యీ యంశాన్ని చక్కగా చిత్రిస్తుంది.

"కని కద్రువ వినతంజూచి, చూచితె, యల్ల యతిధవళంబైన యశ్వంబు సందలి సంపూర్ణ చంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబునందు నల్లయై యున్నయది యనిన విని వినతనగి నీవే కన్నులం జూచితేయక్క; యెక్కడి నల్ల ? యీ యశ్వరాజమూర్తి మహాపురుష కీర్తియుంబోలె నతి నిర్మలంబై యొప్పుచున్న యది".

ఇట్లు వ్రాయడం చేత కథకు ఎంతటి సహజత్వ మేర్పడింది. వేరుగా చెప్పనవసరం లేదను కొంటాను.

వర్ణన అనే అంశం ఏ కావ్యంలోను ప్రధానమైనట్టిదే. మహా భారతానికి ఐతిహాసికత అనేగుణం ఉన్నప్పటికీ, సందర్భానుసారంగా వర్ణనలు చేయవలసి వస్తూనే ఉంటుంది. నన్నయభట్టు, వర్ణనల సందర్భాల్లో, కేవలం వచనములనే ఉపయోగించినాడని చెప్పడం సముచితంకాదు కాని, పద్యాలతోబాటు హృద్యంగా ఉండే వచనాలను కూడ కూర్చి ఉన్నాడు. ఈ సందర్భంలో, అలంకార ప్రయోగంలో కాని, భావ వ్యక్తీకరణలో కాని, పద్య గద్య భేదాన్ని అతడు పాటించినట్లే కాన్పించదు. ఈ కవి రెండు సందర్భాల్లో శ్లేషాలంకారాన్ని ఉపయోగించినాడని విమర్శకుల అభిప్రాయం. సముద్ర వర్ణనలో వచనాన్ని శ్లేషాలంకారాన్వితంగా రచించి ఒక శ్లేషాలంకారాన్ని గద్యానికి కూడ వినియోగించినాడు. ఇది చూడదగింది.

"... కరిమకర నికరాఘాత జాతవాతోద్ధూత తరంగాగ్ర సముచ్ఛలజ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగన తలంబైనదాని, నుద్యానవనంబునుంబోలె బహు విద్రుమ లతాలంకృతంబైనదాని, నాటక ప్రయోగంబునుబోలె ఘనరసపాత్ర శోభితరంగ రమ్యంబైనదాని, దివంబునుంబోలె నహిమకర భరితంబైనదాని మరియు" (ఆది - 2-27)

శ్లేషాదికములు లేని వర్ణనలు ఈ విధంగా ఉంటవి. "శాస్త్రవిహిత ప్రమాణోపేత వృత్తాయామంబును, నపాకృత వృక్ష గుల్మ వల్మీకంబును, నంగీకృత పూర్వోత్తర ప్లవంబును, సమీకృత నిమ్నోన్నత ప్రదేశంబును, దూరీకృత కంటక పాషాణశల్య శకలంబును, విరజీకృత రజోధూసర స్థలం

బును విరచిత బహువిధ ప్రేక్షాగారాంచిత మంచ మణిమయ ప్రపంచంబును, నానాధ్వజ పల్లవతోరణ చందన మాల్యాలంకృత ద్వారదేశంబును, ప్రతిదిన నిర్వర్తిత శాంతిక బలి విధానంబుగా జేయించిన...." ఆది - 6_9 )

కుమారాస్త్రవిద్య సందర్శన ఘట్టములోని వచనమిది.

ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థసూక్తి నిధిత్వము అనువాటిని, నన్నయ తన కవితకు ప్రధానాశయాలుగా పేర్కొన్నాడు. ఈ అంశాలను పరిశీలిస్తున్నప్పుడు, పండితులలో చాలమంది పద్యాలనే గ్రహించివారు కాని వచనాల జోలికి పోలేదు. కాని పరిశీలనా దృష్టితో జాగ్రత్తగా పరిశీలిస్తే, ఈ సల్లక్షణాలు వచనంలోను కాన్పిస్తాయి. పైన చెప్పిన నన్నయగారి సంక్షిప్తీకరణ పద్ధతి, సంభాషణలో వచనాలను ఉపయోగించడం, అనేవి వచనాలు వ్రాసే సందర్భంలో ప్రసన్న కథాకథక పద్ధతి ఏవిధంగా ప్రయోగించినాడో స్పష్టం చేస్తాయి. ఆ విధంగానే అక్షర రమ్యత అనే గుణానికి ఈ పద్య గద్యాలను తులనాత్మకంగా పరిశీలించవలసి ఉంటుంది.

"సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్క ప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రని స్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘను కర్ణాఖ్యున్ జగత్పూర్ణ పూ
ర్ణాలోలద్యుతి జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్.

"ఆచార్యుండు శుక్లాంబరాభరణ మాల్యానులేప యజ్ఞోపవీత పలిత కేశ శ్మశ్రు దేహుండయి, రంగమధ్యంబున నశ్వత్థామ సహితుండయి విముక్త జలదజాల వియన్మధ్యంబున నంగారక సహితుండయిన యాదిత్యుండునుబోలె నున్న నగణ్యభూసురవరేణ్య పుణ్యాహ వాచనానంతరంబున"

పద్యంలో ఉన్న అక్షర రమ్యత ఈ వచనంలో లేదనడం ఎట్లా సాధ్యమవుతుంది ?

లోకజ్ఞుడగు నన్నయ తన కావ్యంలో వివిధ సూక్తులను నిక్షిప్తం చేసి నానారుచిరార్థ సూక్తి నిధిత్వం అనే గుణాన్ని సార్థకం చేసికొన్నాడు. ఇదివరలో

విమర్శకులు ఈ సూక్తులను కూడ పద్యాల్లోనే వెదకినారు కాని. వచనములను పరిశీలించినట్లు కాన్పించదు. కాని, సరిగా చూస్తే, ఇవి వచనాల్లో కూడ సమృద్ధిగా కన్పిస్తాయి వైదికములు, వర్ణాశ్రమధర్మ సంబంధములు, లౌకికములు మొదలైన సూక్తులు వచనాల్లో కనిపిస్తున్నవి. ఈ కొద్ది వాక్యాలీ విషయాన్ని స్పష్టం చేస్తాయి.

'జ్ఞాదజ్ఞాత్సంభవసి'

'కామ ప్రవృత్తుండయ్యును మహీపతి మహీసురవర పురస్సరుండగు నేని యెల్లయుద్ధంబుల శత్రుల జయించు'.

రాజులకు గార్యవశంబునంజేసి మిత్రామిత్ర సంబంధంబులు సంభవించు!

'బుద్ధిగలవారికిఁ గ్రోధంబు గొనియాడందగదు'

'పతినియోగించిన పనిచేయని నాడు భార్యకుం బాతకమగు'. ఇట్టివి అనేకములు నన్నయగారి వచనాల్లో ఉన్నవి ఇవి అనాటి సాంఘిక విశేషాలను, నాటి సాంఘిక నిర్మాణాన్ని చెప్పక చెప్పుతూ ఉన్నవి.

లక్షణకారులు విధించిన చూర్ణిక, ఉత్కళికాప్రాయలు, వృత్తగంధి, అనేరీతివైవిధ్యం కలిగిన వచనాలు నన్నయ వచన రచనలో ఉన్నవి. వాటిని విశదంగా వ్రాయడానికి ఇచట అవకాశంలేదు కాని, ఇటువంటి రచనలు వచన రచనలో వైవిధ్యం కలిగించి కావ్యాన్ని రసవంతంగా చేయడంలో తోడ్పడి నాయి.

నన్నయ తరువాత అంధ్ర మహా భారత రచనకు పూనుకొన్న తిక్కన, ఎఱ్ఱన, చాలవరకు నన్నయ అడుగుజాడల్లోనే వచన రచన గావించినారు. కాని, తిక్కన తన రచనమున వచన పరిమాణమును తగ్గించి యిరువదియైదు శాతము మాత్రమే వచనమున వ్రాసినాడు. ఇతడు తన పద్యాల్లోవలెనే తత్సమపద ప్రయోగాన్ని తగ్గించి, దేశ్యపదోపయోగాన్ని అధికం చేసి వ్రాసినాడు తిక్కన యుద్ధములను వర్ణించే సందర్భాల్లో వ్యూహ రచనను గురించి చెప్పవలసి వస్తే విధిగా వచనాన్ని మాత్రమే గ్రహిస్తూ ఉంటాడు. దీనివలన రచనలో వస్తు వైశద్యం ఏర్పడుతుంది. ఈ గుణాలన్నీ, తిక్కన స్వతంత్ర ప్రవృత్తినీ,

నన్నయపై అతనికిగల గౌరవాన్ని వ్యక్తంచేస్తాయి. ఎఱ్ఱాప్రెగ్గడ కూడ తనకు పూర్వులైన కవిద్వయాన్ని మహాభారత రచన సందర్భంలో అనుసరించినాడు. కాని, అతడు రచించిన నృసింహ పురాణంలో వచనానికి ఒక ప్రముఖ విశేషం కల్పించినాడు. దానిలో ఎఱ్ఱన అంగవర్ణన వచనము, స్తంభోద్భవ వచనము అనే శీర్షికలలో ప్రత్యేక వచనాలను వ్రాసినాడు. ఇవి గంభీర గమనంతో కూడి ఉత్కళికాప్రాయాలు అనదగి ఉన్నాయి అంగవర్ణన వచనల నిశ్చల వర్ణనానికి, స్తంభోద్భవ వచనం చలనాత్మక వర్ణనానికి ఉత్తమ ఉదాహరణలని చెప్పవచ్చు. ఓజోగుణ ప్రధానాలైన వచనములు వ్రాయడంలో ప్రథముడు ఎఱ్ఱాప్రెగ్గడయే. నాచన సోమనాథుడు కూడ ఉత్తమ వచన రచన చేసినాడు. ఉత్తరహరి వంశంలో చాల చోటుల్లో వర్ణన సందర్భాలలో వచనములు కన్పిస్తూ ఉన్నవి. ఇవికూడ నృసింహ పురాణంలో వలె గంభీర గమ్యం కలిగినట్టివే ఇట్లు చూడగా, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచన సోమనాథుడు, మునుముందు రాబోయే ప్రబంధ కర్తల వచన రచనకు మార్గదర్శకులైనారని చెప్పవలసి ఉంటుంది. ఉత్తర హరివంశంలో ఒక అచ్చ తెనుగు వచనం ఉన్నది. దీన్ని సర్వజ్ఞుడగు నాచన సోమనాథుడు తన పాండితీ ప్రకర్షను ప్రకటించడానికే వ్రాసి ఉంటాడు.

## పోతన - శ్రీనాథుడు :

ఆంధ్ర వాఙ్మయంలో పోతన రచించిన మహాభాగవతానికి ప్రత్యేక స్థానం ఉన్నది. అంధ్రులకు అభిమాన పాత్రమైన భక్తి అనే భావానికి రస స్థాయిని కలిగించి కావ్య రచన చేసినవాడు పోతన. నూతనంగా, అనుప్రాసాది శబ్దాలంకారాలను కూర్చి, పండితులను, పామరులను సమానంగా రంజింపచేసిన వాడు పోతన. పోతనకుగల ఈ రెండు ప్రధాన గుణాలు కేవలం పద్యాలకే పరిమితం కాలేదు. తన కావ్యంలో ఇరువది శాతం రచించిన వచనాల్లో కూడ ఈ గుణాలు ప్రత్యక్షంగా కన్పిస్తున్నవి. పోతన జీవించిన కాలం—అంటే క్రీ. శ. 15 వ శతాబ్ది—నాటికి తెలుగులో స్తుతి కావ్యాలనబడే భక్తి రచనలు వెలువడినాయి. ఇవి వచనైకములే అయినా, పోతన వాటిచేత ప్రభావితుడై, సరళ సుందరంగాను, భక్తి ప్రధానంగాను ఉండే స్తుతి వచనాలను రచించినాడు. సామాన్యంగా ఇటువంటి వచనములు, దేవా, ఈశా, వంటి సంబోధనలతో

ప్రారంభమై నమః, నమస్తే, అనే పదాలతో అంతమవుతూ ఉంటవి. ఈ వచనమును పరిశీలించండి.

"దేవా, సర్వభూతాంతర్యామివై భగవంతుడవైన నీకు నమస్కరించి మదీయవాంఛితంబు విన్నవించెద నవధరింపుము. అవ్యక్తరూపంబులై వెలుంగు భవదీయ స్థూల సూక్ష్మరూపంబులును, నానాశక్త్యుప బృంహితంబులైన బ్రహ్మాది రూపంబులును, నీయంత నీవె ధరియించి, జగదుత్పత్తి స్థితిలయంబులం దంతు కీటకంబునుంబోలె గావించుచు, నమోఘ సంకల్పుడవై లీలా విభూతిం గ్రీడించు మహిమంబు దెలియునట్టి పరిజ్ఞానంబు కృపసేయుము. భవదీయ శాసనంబున జగన్నిర్మాణంబు గావించునప్పుడు బ్రహ్మాభిమానంబునజేసి యవశ్యంబును మహదహంకారంబులు నామదింబొడముం గావున, దత్పరిహారార్థంబు వేడెద; నన్ను గరుణార్ద్ర దృష్టి విలోకించి దయసేయుము" (ఆంధ్ర మహాభాగవతము. 2–249)

ఇక గద్యపద్యాల్లో అనుప్రాసాది శబ్దాలంకారాలను ఈ కవి ఒకే విధంగా ఎట్లుపయోగించినాడో తెలిసికొనడానికి ఈ క్రింది ఉదాహరణ ఒకటి చాలు నను కుంటాను

"భూసురుడవు బుద్ధి దయా–భాసురుడవు శుద్ధవీర భటసందోహా
గ్రేసరుడవు శిశుమారణ–మూసుర కృత్యంబు ధర్మమగునే తండ్రీ"

"....ప్రథమ కవితా రచన విద్యా విలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవ దనుజకర పరిమిళిత నిగమ నివహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహా భాగవత కథాసుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి, మృదు మధుర వచన వర్గ పల్లవిత స్థాణునకుం బాణునకుం బ్రణమిల్లి, కతిపయ శ్లోక సమ్మోదిత సూరు మయూరు నభినందించి మహాకావ్యకరణ కళావిలాసుం గాళిదాసుం గొనియాడి, కవికమల రవిం భారవిం బొగడి ..."

ఇట్టి వచనములే అనేక సందర్భాల్లో కనిపిస్తవి. ఈ ఆలంకారిక రచన వలన, పోతన గారి పద్యాలకు వలెనే, వచనములకు కూడ ఒక వింత సొగసు

సమకూడింది. ఇదికాక, వంశానుక్రమణికల్లోను, వర్ణనల్లోను, తత్త్వోపన్యాస విస్తరణంలోను, పోతన సముచితంగా వచనమును ఉపయోగించినారు.

సూక్ష్మంగా ఉండే విశేషాలను వదలి స్థూలంగా చూచినప్పుడు శ్రీనాథుడు తన కావ్యాల్లో రచించిన వచనాలు కూడ పోతన గారి వచనముల వంటివే అని చెప్పవలసి ఉంటుంది. శ్రీనాథుడు కూడ తన గ్రంథాలను చంపువులుగానే రచించినాడు. ఈ గ్రంథాల్లో అచ్చటచ్చట స్తుతి వచనా లున్నవి. కాని, పోతనకు ఉన్న శబ్దాలంకారాభిమానం శ్రీనాథునికి లేదు అందుచేత శ్రీనాథుడు రచించిన వచనాల్లో శబ్దాడంబర మంతగా కాన్పించదు. వర్ణనము లందు, తాత్త్విక విశేష వివరణలలో వచనాలనే ఉపయోగించి, శ్రీనాథుడు పోతనతో ఈ విషయంలో ఏకీభవిస్తాడు ఈ విశేషాలన్నింటిని చూచినప్పుడు కవిసార్వభౌముడైన శ్రీనాథుడు వచనమును సముచితంగా ఉపయోగించినాడనీ, దాన్ని రచించడంలో తగిన శ్రద్ధ కనబరచినాడని చెప్పిన సమంజసంగా ఉంటుంది.

ప్రబంధాలు :

క్రీ. శ. 16వ శతాబ్దంలో ఆంధ్ర సాహిత్యం ఒక ముఖ్యమైన మలుపు తిరిగింది. దాని పరిణామంగా తెలుగు సాహిత్యంలో నూతన ప్రక్రియ అయిన ప్రబంధం ఆవిర్భవించింది. ప్రబంధ రచయితల సాహిత్య దృష్టి తత్పూర్వుల కన్న భిన్నంగా ఉంటుందనడం నిర్వివాదం కదా, కథా విధానంలో, వర్ణణ ఘట్టాల సందర్భంలో, శబ్దోపయోగంలో, ప్రబంధ కవులు అనేక నూత్న మార్గాలను అవలంబించినారు. ఇటువంటి నూత్న దృష్టి కేవలం పద్య రచనకు మాత్రమే సీమితం కాలేదు. ప్రబంధాలు కూడ చంపూ రచనలు కావడంచేత విధిగా ఆ రచయితలకు వచనం రచింపవలసియే వచ్చింది. ఇదివరకు వచ్చిన గ్రంథాల్లో వచనం ఇరువది శాతం (దాదాపుగా) ఉండగా, ప్రబంధాల్లో ఈ నిష్పత్తి పది నుండి పదిహేను శాతం మాత్రమే ఉన్నది. అంటే, వీరు వచనమునకు ఉండే ప్రయోజనాలను పరిమితం చేసినారని చెప్పవలసి వస్తుంది. పూర్వ కవులు, రచనకు సంబంధించినంతవరకు గద్యపద్యాలను సమానంగానే భావించినారు. కాని, ప్రబంధ కర్తలు వచన రచనలో కఠిన శైలినే అవలం

బించినారు. వారి పాండితీ ప్రకర్షను ప్రదర్శించడానికీ, వచనాలే పట్టుకొమ్మలై నాయి. మను చరిత్రలో అల్లసాని పెద్దన వ్రాసిన ఈ వచనం చూడవలసిందే.

"లంబమాన రవిరథతురంగ శృంగార చారు చామరచ్ఛటా ప్రేక్షణ క్షణోద్గ్రీవ చమర సముదయంబగు నుదయంబునంగల విశేషంబులు శేషఫణికి నైన లెక్కింప శక్యంబె ? యంధకరిపు కంధరావాస వాసుకి వియోగభవ దుర్వ్యథా భోగభోగినీ భోగభాగ పరివేష్టిత పటీర విటపి వాటికా వేల్ల దేలాలతా వలయంబగు మలయంబునం గలుగు చలువకు విలువ యెయ్యది; యక్కట కట ! వికట కూట కోటి విటంక శృంగాటకా ధౌకమాన శరదిందు బింబగళ దమృతబిందు దుర్దినార్ద్రీకృత సల్లకీపల్లవ ప్రభంజన పరాంజన హస్తి హస్తం బగు నస్తంబునంగల మణిప్రస్తరంబుల విశ్రాంతి జింతించిన మేనం బులకలి ప్పుడుం బొడమెడు . . ."

ఈ వచనమునకు ముందున్న పద్యంలో ఈ శబ్దకాఠిన్యం లేనేలేదు. చూడండి.

"కేదారేశు భజించితిన్; శిరమునన్ గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్, ప్రయాగ నిలయున్ బద్మాక్షు సేవించితిన్
యాదోనాథ సుతాకళత్రు, బదరీనారాయణుం గంటి, నీ
యాదేశంబననేల ? చూచితి సమస్తాశావకాశంబులన్"

ఛందోరహితమైన రచన వచ్చేటప్పటికి, ప్రబంధ కర్తలకు అనివార్య మైన ఓజోగుణం కలుగుతుంది అనే అంశాన్ని పై ఉదాహరణ నిరూపిస్తూ ఉన్నది. మనుచరిత్రలోని ఈ ఉదాహరణ, ఆ కాలంలోను, తరువాత, వెలు వడిన ప్రబంధాలకున్నూ సమానంగా అన్వయిస్తుంది. రచనపట్ల ప్రబంధ రచ యితల దృష్టి సమానం కావడమే దీనికి కారణం. ఇక్కడ ఒకటి రెండు విష యాలు స్పష్టం చేయవలె. రచనలో, ముఖ్యంగా వచన రచనలో, ఈ కవులు ప్రమాణానికి (Quality) ప్రాధాన్య మిచ్చిరే కాని, పరిమాణము (Quntity) నకు ప్రాధాన్య మీయలేదు. అందుచేతనే ఉన్న స్వల్పమైన వచనం కూడ ఓజోగుణ ప్రధానమై, ఆలంకారిక రచనతో ఒప్పారుతూ ఉన్నది. ఇక వచన

ప్రయోజనాన్ని కూడ ఈ కవులు పరిమితం చేసినారు. సాధ్యమైనంతవరకు వర్ణన సందర్భాల్లోనే వీరు వచనాన్ని వ్రాస్తూ ఉంటారు. ఒక్కొక్కసారి శైలీ వైవిధ్యాన్ని సాధించడానికి కూడ వీరు వచనం వ్రాయడం మనం గమనించ వచ్చు. మొత్తంమీద ప్రబంధ కర్తల వలస తెలుగు వచనం శైలీ పరిపుష్టిని సంతరించుకొన్నది.

## వచనైక రచనలు-స్తుతివచనములు :

క్రీ. శ. 14వ శతాబ్దంలో మొట్ట మొదటి ఆంధ్ర వచన గ్రంథం వెలు వడింది. కాని, యింతకుముందే, చంపూ కావ్యాల్లో వచనానికి ఒక స్వరూపం ఏర్పడి ఉండింది. కాని కేవలం వచనంలో గ్రంథ రచన చేసే సంప్రదాయం మాత్రం యింకా రాలేదు. క్రీ. శ. 13 వ శతాబ్దంలో సోదర భాష అయిన కన్నడంలో బసవేశ్వరుడు, అక్కమహాదేవి, దేవరదాశమయ్య అనేవారు ఛందోరహితమైన స్తుతి వచనాలను వ్రాసి ఉండిరి. బహుశః తెలుగు రచయి తలు ఆ కర్ణాటక రచయితలచేత ప్రభావితులై తెలుగులోను ఇట్టి రచనలుచేసి ఉంటారు. ఇదికాక, సంస్కృతంలో గద్యత్రయం అనే మూడు గద్యాలను, స్తుతి ప్రధానంగా ఉండే వాటిని, వైష్ణవ పరమాచార్యులయిన శ్రీరామానుజా చార్యులవారు రచించినారు. ఈ గద్యాలు వైష్ణవ సమాజంలో బహుళ ప్రచా రాన్ని పొందినాయి. తెలుగులో వెలువడ్డ స్తుతి వచనాలకు ఇవికూడ మార్గ దర్శకాలై ఉంటవి.

ఈ స్తుతి వచనాలు, రచయిత యిష్టదైవ సంబోధనతో ప్రారంభమవు తాయి. అంతంలో నమోవాకంతో కూడిన మకుటం ఉంటుంది. సంఖ్యానియమం లేదుకాని, ఈ వచనాలు శతకాన్ని పోలినవి. శతకంలో ఏ పద్యానికా పద్యం స్వతంత్రంగా ఉన్నట్లే, స్తుతి వచనాలు కూడ వేటికవే స్వతంత్రంగా ఉంటాయి. అయినప్పటికీ, శతకాల్లో భక్తి, నీతి, వైరాగ్యం మొదలైన వస్తు వైవిధ్యం కాన్పిస్తుంది. కాని ఈ వచనములన్నింటిలోను మణుల్లో సూత్రంవలె భక్తియే ప్రధానంగా ఉంటుంది. తెలుగులో ఈ వచనాలు రెండు విధాలుగా ఉన్నవి. వైష్ణవ మత ప్రతిపాదకాలు మొదటివి. శైవమత ప్రతిపాదకాలు రెండవ విధమైనవి.

ఓరుగల్లును పాలించిన రెండవ ప్రతాపరుద్రుని కాలంలో జీవించి, అతి మానుష శక్తి సమన్వితుడుగా ప్రఖ్యాతిని వహించిన కృష్ణమాచార్యులు రచించిన సింహగిరి వచనములు అనే గ్రంథాన్ని ఈ స్తుతి వచనాల్లో మొదట పేర్కొన వలసి ఉంటుంది. సరళశైలీ సమన్వితమై, భక్తిభావ బంధురమై, ఉన్న ఈ వచనాలను కృష్ణమాచార్యులు నాలుగు లక్షల సంఖ్యలో రచించెనట. కాని, మన దురదృష్టవశాన ఇవన్నీ మనకు దొరకలేదు. కేవలం అరువది వచనములు మాత్రం లభించినాయి. ఈ వచనము లొకప్పుడాత్మాశ్రయాలుగాను, ఇంకొక ప్పుడు సేవ్య సేవక సంబంధ సూచకాలుగాను, ఉండి భక్తితో కూడిఉన్నట్టివి. ఈ వచనం ఉదాహరణప్రాయంగా ఉన్నది.

"దేవా, పెద్దతనంబుసేసి మిమ్ములను మెప్పించెదనంటినా, జాంబవంతుం డు మీ సన్నిధినే యున్నాడు. దేవా,బుద్ధి మెప్పించెదనంటినా, విభీషణుండు మీసన్నిధినే యున్నాడే, దేవా, బంటుతనంబు సేసి మెప్పించెద నంటివా, హనుమంతుడు మీసన్నిధినే యున్నాడే. దేవా, తీర్థంబులాడి మిమ్ము మెప్పిం చెద నంటినా గంగాభవాని మీయంగుష్ఠంబు నందే యున్నదే. దేవా ప్రదక్షి ణలు తిరిగి మిమ్ము మెప్పించెద నంటినా, సూర్యచంద్రాదులు మీ సన్నిధినే యున్నారే. దేవా, వేదవేద్యుండనై మిమ్ము మెప్పించెద నంటినా, బ్రహ్మ మీ నాభికమల మందే యున్నాడే....సింహగిరినృహరీ, నమో నమో దయానిధీ!"

కృష్ణమాచార్యుల భక్తి భావం చేత ప్రభావితులైన పలువురు రచయితలీ విధమైన రచనలే చేసినారు. తాళ్లపాక పెద తిరుమలాచార్యులు వేంకటేశ్వర వచనములను పేర కొన్నివచనాలను రచించినాడు. ఇవి తిరుమలలో వెలసి ఉన్న శ్రీ వెంకటేశ్వరస్వామికి అంకితములైనాయి. సింహగిరి వచనములవలె ఈ వచనములు కూడ ఉత్తమరచన, భావంతో కూడినట్టివి. ఈవచనం ప్రదర్శిం చ దగినట్టిది,

"నీలమేఘశ్యామా, అణువునకు నణువవు; మహత్తులకు మహనీయుం డవు. ప్రకృతి పురుషునకుం బరమాత్మవు. మూడు మూర్తులకు మూలమవు చరాచరంబులకు సాక్షివి. ఊహించి చూచిన నొక్కండవే దేవుండవు. ఏర్పరచి చూచిన ననంతుండవు. వినంగడంగిన కల్యాణ గుణుండవు. కన్నులంజూచిన

సాకారమవు. స్వరూపవ్యాప్తిని నిరవద్యుండవు. స్వాతంత్ర్యంబున జీవచైతన్య మవు. భక్తవరులకుఁ బ్రసన్నుండవు. తుదివిచారించిన జగత్కర్తవు. ఇట్టి నీగురుతు తెలియంగవచ్చు నయ్యా; పెక్కురూపంబులు గలవాడవు, పెక్కు నామంబులు గలవాఁడవు. వేదవాదులకు నగోచరుండవు ; నిన్నుం చేపట్టి కొలువ నేరము. నీవే కరుణించి కావవే శ్రీ వేంకటేశ్వరా !"

ఈవచన రచయితలు వీరి తరువాత వారగు బమ్మెరపోతన వంటి కావ్య రచయితలను, తాళ్లపాక అన్నమాచార్యులవంటి గేయ రచయితలను ప్రభావితం చేసిరి. శఠకోపవిన్నపములు, శేషగిరినాథ విన్నపములు, మున్నగు రచనలు చూడ ఈ కోవకు చెందినట్టివే. శైవసంబంధ వచనల్లో భవానీ మనోహర వచనములు, గంగాధరయ్య వచనములు, కాళికాధీశ్వర వచనములు, మున్నగు నవి పేర్కొనదగినవి. రచనయందు మౌలికంగా ఇవి కూడ సింహగిరివచనాల వంటివేయైనా, వీటికి శైవమత విశేషాలతో సంబంధం ఉన్నది.

చారిత్రక కావ్యాలు :

ఇతర భారతీయ భాషల్లో వలెనే తెలుగు భాషలో కూడ చరిత్ర రచన స్వల్పంగా ఉన్నది. మనవారు చారిత్రకవ్యక్తులను కూడ, అతిమానుషులనుగా చేసి వారి చరిత్రలను గాథలు చేసి, వాటిని అవిశ్వసనీయాలుగా మారుస్తూ ఉంటారు. అందుచేత పూర్వకాలంలో చరిత్రకు సంబంధించిన ప్రామాణిక కావ్యాలు విశేషంగా వెలువడలేదు. చరిత్ర రచనకు పద్యంకంటె వచనమే అనువైంది. అలంకారిక రచనకు, అతిశయోక్తులకు వచనంలో అవకాశం తక్కువ, ఈ అంశాలను గుర్తించే కాబోలు ఏకామ్రనాథుడు అనే రచయిత క్రీ. శ. 16వ శతాబ్దంలో ప్రతాప చరిత్ర పేరుతో ఒక వచన గ్రంథాన్ని రచించినాడు. ఈగ్రంథరచనా కాలంలో తెలుగులో విశేషంగా పద్యకావ్యాలు వెలువడుతూఉండగా, వాటికి భిన్నంగా ఉండే వచన గ్రంథాన్ని, చరిత్ర ప్రధాన మైనదాన్ని ఈతడు రచించడం చూస్తే, ఏకామ్ర నాథునికి ఉన్న నూత్నదృష్టే కారణమనిపిస్తుంది. ఈ విధంగా తెలుగు వచనంలో చరిత్రకు సంబధించిన ప్రథమగ్రంథం ప్రతాపచరిత్రమే.

ప్రతాప చరిత్ర కాకతీయ రాజవంశజుల్లో ముఖ్యుడై, క్రీ. శ. 14వ శతాబ్ది ప్రథమ పాదంలో తెలుగు దేశాన్ని పాలించిన రెండవ ప్రతాపరుద్రుని చరిత్రను తెలిపే గ్రంథం. ప్రసక్తానుప్రసక్తంగా, ఈ గ్రంథంలో, కాకతీయ వంశోత్పత్తికి సంబంధించిన విశేషాలు, మాధవ వర్మ మొదలగు వారి కథలు, అనుమ కొండదుర్గ వృత్తాంతం వర్ణితమైనాయి. ఇవికాక, తిక్కన సోమయాజి, కుమ్మర మొల్ల, విష్ణు భక్తుడైన కృష్ణమాచార్యులు సందర్భాన్ని పురస్కరించు కొని ప్రశంసింపబడినారు. ఈ గ్రంథంలో కొన్ని అవిశ్వసనీయ విషయాలు లేకపోలేదు కాని, ఇందలి అంశాల్లో చాలవరకు చారిత్రకంగా యథార్థాలని చారిత్రకులు విశ్వసిస్తున్నారు. కాకతీయ రాజ్య పతనానంతరం రెండు శతాబ్దాలకు లోపునే ఈ గ్రంథం రచింపబడటంచేత, కొన్ని మాత్రమే అచారిత్రక విషయాలు దానిలో ప్రవేశించినవి.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో పురాణయుగంగా భావింపబడే కాలంలో ఈ గ్రంథం రచితం కావడం చేత, ఈ గ్రంథముపై పురాణ ప్రభావం అధికంగానే కానిపిస్తుంది. ఇష్టదేవతాస్తుతి, కథోపక్రమణ మున్నగు భాగాల్లో ఈ అంశం స్పష్టంగా కాన్పిస్తుంది. నన్నయాదులు ఆంధ్ర మహా భారతంలో కథనానికి ఎటువంటి శైలిని అవలంబించినారో, అదే వచన శైలిని దీనిలో ఏకామ్రనాథుడు అనుసరించినాడు. నిజానికి శైలి చాలసముచితమైనది కూడ. నిరలంకారమై సరళంగా ఉండి, పాఠకునికి యథార్థాన్ని అందించడానికి ఈ శైలి చక్కగా ఉపకరించింది.

చారిత్రక కావ్యపరంపరలో రెండవదిగా చెప్పదగినది రాయవాచకం అనే గ్రంథం. విజయనగర సామ్రాజ్యన్ని పాలించిన శ్రీకృష్ణదేవరాయలకు కొద్ది కాలం తరువాతివాడై క్రీ. శ. 16వ శతాబ్దంలో జీవించి, మధురపాలకుడైన విశ్వనాథనాయకుని రాజకీయోద్యోగి, స్థానపతి అనేవాడు ఈ గ్రంథాన్ని రచించినాడు. ఈతని పేరు తెలియదు. ఈ గ్రంథంలోని ప్రధాన వృత్తాంతం శ్రీ కృష్ణదేవరాయల చరిత్ర. కాని దానికి భూమికగా, విద్యారణ్యుల వృత్తాంతము, వ్యాససాక్షాత్కారము విద్యానగర నిర్మాణము మున్నగు విషయాలు వర్ణితమైనవి. గ్రంథకర్త కావ్య వస్తువును గురించి ఈవిధముగా చెప్పినాడు.

"విజయనగర వృత్తాంతము-సుజనులచే విన్నయట్టి సూనృత వాక్కుల్
ప్రజలకు తేటపడంగా,-సృజియించితి కృష్ణరాయ శేఖరుచరితల్"

ఈ పదాన్ని బట్టి ముఖ్యవిషయాలు కొన్ని తెలియవస్తున్నవి. ఈ గ్రంథకర్త కృష్ణదేవరాయల సమకాలికుడు కాడనీ, కాలం తరువాత నివసించినాడనీ, అనుట మొదటిది. ఎందుచేతననగా తాను 'సుజనులచే విన్నయట్టి సూనృత వాక్కుల్' గ్రంథస్థము చేసానని అన్నాడు. కాని తాను స్వయంగా చూచినవి వ్రాస్తానని అనలేదు. ఇక రెండవ విషయమేమంటే, అది కృష్ణరాయ చరిత్రకు ప్రాధాన్యం. అంటే మిగిలిన విషయాలు అప్రధానాలే అనడమన్న మాట. ఇంతముందు వెలువడ్డ ప్రతాపచరిత్రకూ, ఈ గ్రంథానికి పోలికలుకొన్ని ఉన్నాయి. ఈ రెండు గ్రంథాల్లోను తెలుగు దేశాన్ని పాలించి. విశేషఖ్యాతి నందిన చక్రవర్తులే నాయకులు. ఈ రెండు కూడ వచన గ్రంథాలే, శైలిలో స్వల్పమైన భేదం ఉండవచ్చును.కాని, వస్తువు మాత్రం రెండింటిలోను దేశ చరిత్రే. ప్రతాపచరిత్రలో మాధవశర్మ చరిత్ర ఉన్నట్లుగానే, దీనిలో విద్యారణ్య చరిత్రమున్నది. ఈ ఇద్దరూ, తమ గ్రంథాల్లోని అంశాలను విని వ్రాసిన వారే. ప్రత్యక్షంగా చూచినవారు కారు. ఈఅంశాలను పరిశీలించినప్పుడు రాయవాచకకర్త పతాపచరిత్రను పఠించి దానిప్రభావంచేత ఈ చారిత్రక గ్రంథ రచనకు పూనుకొన్నాడేమో అని అనిపిస్తుంది. రాయవాచక శైలిని గురించి కొద్దిగా చెప్పవలె. ఈగ్రంథం వ్యావహారిక శైలిలో రచితమైంది, ఒక్కొక్క సారి గ్రామ్యం అని కూడ చెప్పవచ్చును. ఈక్రింది పంక్తులు దానిలోని శైలిని ప్రతిబింబింపజేస్తాయి.

"ఇట్లు సింహాసనస్థుండు, స్వామ్యామాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలంబులను రాజసప్తాంగంబుల దెలిసి, ఆందోళికాంబర ఆభరణ వాహనరాజ సన్మాన కప్పురతాంబూలంబులను ఉచిత సప్తాంగంబులను రాశియెరుంగవలయు. సామ భేద దాన దండ మాయోపాయ ఉపేక్ష మహేంద్రజాలంబులను సప్తోపాయంబుల తెలియవలయు. రాజులకు సమస్త వ్యసనంబులు గలవు. అవి యేవంటేని, స్త్రీ వ్యసనము, జూదము, జూదమాడుట, పానము, సురాపానము చేయుట, వేటపోవుట, పలుకు ప్రల్లదము, తిట్టుట, అకారణందండించుట, అనుచితం వెచ్చబెట్టుట, యీ యేడు వ్యసనములును వర్జించవలెను. ఇదిగాక

సుతనిధి దేవగేహ వనతటాక కృతి బ్రహ్మప్రతిష్ఠ మొదలైన సప్త సంతానంబుల బడయవలయు...."

ఈ విధంగా అనేక విషయాలనీతడు ప్రస్తావించుతూ ఉంటాడు. దీనిలో నీతి, రాజనీతి కూడ ఉన్నవి ఇవి మహాభారతం, బద్దెనసీతి, చాణక్య శతకం, కవికర్ణ రసాయనం మొదలైన గ్రంథాలనుండి గ్రహింపబడినాయి. ఈ గ్రంథంలో మాండలిక పదాలు, అన్యభాషాపదాలు విరివిగా ఉపయోగింపబడినవి. పట్టెలు (ఆభరణాలు), ప్రహరి బడగరలు (ప్రహరిని రక్షించే యోధులు), చేర్వగార్లు (రౌతులు), ఉడగరులు (కానుకలు), మొదలైన పదాలను మాండలిక పదాలకుగాను, బయదలు (పదాతియోధుల), ఆముష్టీదు (సిద్ధంకావడం), భరవసము (విశ్వాసం), హేజీబు (దౌత్యవ్యవహర్త), మున్నగు వాటిని అన్యభాషా పదాలకును ఉదాహరణలుగా చెప్పవచ్చు. నిజానికీ గ్రంథం ఒక రాజకీయ నివేదిక వంటిదేయైనా, పై విశేషాలవల్ల దీనికి వచన సాహిత్యంలో ప్రత్యేక స్థానం లభించింది. ప్రతాప చరిత్ర ఆధారంగా సిద్ధేశ్వర చరిత్ర అనే ద్విపకావ్యం, రాయ వాచకం ఆధారంగా కృష్ణరాయ విజయం అనే పద్యకావ్యం తరువాతి కాలంలో వెలువడినాయి.

## దాక్షిణాత్య యుగం :

విజయనగర రాజ్యపతనానంతరం ఆంధ్ర సాహిత్యరంగం తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు మొదలైన దాక్షిణాత్య రాజ్యాలకు మారింది. ఈ రాజ్యాల్లో ప్రాయకంగా రాజుగా, వారి అనుయాయులు తెలుగువారు కావడం చేత, తెలుగు సాహిత్యానికి విశేషపోషణం, ప్రాచుర్యం లభించింది. ముఖ్యంగా క్రీ. శ. 17, 18 శతాబ్దుల్లో ఈ ప్రాంతంలో వచన వాఙ్మయం బహుముఖాలుగా వికాసాన్ని చెందింది. కఠినతరంగా ఉండే పద్య కవిత్వాన్ని పఠించే అవకాశం కాని, పాండిత్యం గాని, లేనివారు ఆ ప్రాంతాల్లో బహుళంగా ఉండడం చేత కాబోలు అనేక వచన కావ్యాలు-బయలుదేరినాయి వివిధశాఖల్లో ఆనాడు వెలువడ్డ వచన కావ్యాలను ఇంక ప్రాస్తావిస్తాను

## క్షేత్ర మాహాత్మ్యదులు :

క్షేత్ర మాహాత్మ్యలనే స్థల పురాణాలు అంటారు. వివిధ పుణ్యక్షేత్రాలను

గురించి, ఆ విషయాలు తెలిసిన విజ్ఞులు క్షేత్ర మాహాత్మ్యాదులు వ్రాసినారు. పూర్వం శ్రీనాథుడు వ్రాసిన కాశీఖండం, భీమేశ్వర పురాణం ఇటువంటివే. ఈ యుగంలో వచ్చిన శ్రీరంగ మాహాత్మ్యము అనే వచనకావ్యం ఈ కోవలో మొదట చెప్పదగింది. దీనిని విజయరంగ చొక్కనాథుడు (1706-32) రచించినాడు. ఈతడు మధురానగర పాలకుడు. కవి పండిత పోషకుడు. వైష్ణవులు అతి పవిత్రంగా భావించే శ్రీరంగ క్షేత్ర ప్రశంస ఈ గ్రంథంలో ఉన్నది. శైలి గ్రాంథికంగా ఉండి సరళంగా ఉంటుంది. ఈతడే మాఘ మాహాత్మ్యము అనే గ్రంథాన్ని కూడ రచించినాడు. మాఘమాసంలో ఆచరించవలసిన విధులు దీనిలో వివరించడమైంది. ఇదే వరుసలో చేర్చదగిన ధేను మాహాత్మ్యాన్ని లింగనమఖి కామేశ్వర కవి రచించినాడు. ఈ గ్రంథం చొక్కనాథునికి అంకితమైంది. మహాభారతాంతర్గత అనుశాసనిక పర్వం నుంచి గ్రహించి, కామేశ్వర కవి తెలుగు వచనంలో దీన్ని రచించినాడు. ఇది స్థూలంగా చూస్తే గ్రాంథిక రచనమే యైనా, వాటి, వీటి, పలుకరించు, మందలించు, ఇటువలె, మున్నగు వ్యావహారిక పద ప్రయోగాలు దీనిలో ఉన్నాయి. ఇదే క్రమంలో చెప్పదగింది హాలాస్య మాహాత్మ్యం అనే గ్రంథం. దీన్ని కళువెవీరరాజు కుమారుడు కళువెనంజ రాజు వచన కావ్యంగా వ్రాసినాడు. దీనిలో నంజరాజు మధురలోని మీనాక్షీ సుందరేశ్వరు లీలలను డెబ్బదిరెండు అధ్యాయాల్లో వర్ణించినాడు. ఇతనిదే మరియొక రచన కాశీ మహిమార్థ దర్పణము. ఇది శిష్ట వ్యావహారిక భాషలో ఉన్న వచన గ్రంథం. కాశీనగర క్షేత్ర విశేషాలు దీనిలో వర్ణింపబడినాయి. ఇవిగాక గజారణ్య మాహాత్మ్యము, వేంకటాచల మాహాత్మ్యము, వైశాఖ మాహాత్మ్యము, అనేవి కూడ ఇదేకాలంలో వెలువడ్డ వచన గ్రంథాలే.

## పౌరాణిక కవ్యాలు :

దాక్షిణాత్య యుగంలో పలు విధాలైన పురాణాలు తెలుగు వచనంలో రచితమైనాయి. వీటిని మహాభారత సంబంధములు, రామాయణ సంబంధములు, వివిధములు, అని మూడు రకాలుగా విభజన చేయవచ్చు. భారత సంబంధముల్లో మొదట చెప్పదగింది భారత సావిత్రి అనే చిన్న గ్రంథం. ఎల్లకర నృసింహ కవి దీన్ని రచించినాడు. ఇది బహుళ ప్రచారాన్ని పొందిన గ్రంథం.

భారతంలోని ఉద్యోగ పర్వంలో కౌరవ పాండవులకు సంధి రాయబారం నిర్వహించడానికి శ్రీ కృష్ణుడు హస్తినా నగరంలో ప్రవేశించడం, పాండవ పక్షాన ఐదూళ్లు అడగడము, సంధి వైఫల్యము, కౌరవ పాండవ యుద్ధము, భీష్మ ద్రోణ కర్ణాదుల పతనము, అనే విషయాలీ గ్రంథంలో సంక్షిప్తంగా వర్ణింపబడినాయి. సరళ రచన, చిన్నచిన్న వాక్యాలు, సందర్భాను సారంగా నీతిబోధ, మొదలైనవి దీనిలోని విశేషాలు. సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు వ్రాసిన జైమిని భారతము అనే వచన కావ్యాన్ని కూడ ఇట పేర్కొనవలె. విజయరంగ చొక్కనాథుని సమకాలికుడీ రచయిత. చొక్కనాథుని ప్రోత్సాహంతోనే యీ రచన చేసినట్లు కాన్పిస్తుంది. కొందరు భావించేటట్లుగా, జైమిని భారతం, మహాభారతానికి శేషగ్రంథం కాదు. భాగవతానికీ, వైష్ణవమతానికీ ప్రాచుర్యం కలిగిన తరువాత ఇది రచింపబడిందని పండితులు భావిస్తారు. పిల్లలమఱ్ఱి పినవీరన్న పద్యకావ్యంగాను, సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు వచన కావ్యంగాను దీన్ని తెలుగులోనికి అనువదించినారు.

మహాభారతంలో వలెనే, జైమిని భారతంలో కూడ, వైదిక కర్మల ప్రశంస, యజ్ఞయాదికాల చర్చ, వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాదన, మొదలైన విశేషాలు ఉల్లేఖింపబడినాయి. ఈ గ్రంథ రచయితకు శృంగార వీరభయానక రసాలనే కాకహాస్యాన్ని కూడ చక్కగా పోషించే నేర్పు ఉన్నది. ఈ వాక్యాలు చూడండి: "వృకోదరా, నీకు బుద్ధి మందంబు; ఆహారంబపారంబు; పొట్టరెట్టించుచున్నది. రక్కసి రతుల జొక్కినాడవు. మాటల పోబడి యెరుగవు. నీ వంటివాడు మంత్రియై యున్న గార్యంబులగుటకు సందియంబేమి ?"

ఈ గ్రంథంలో ప్రధాన కథయైన పాండవుల అశ్వమేధయాగ వృత్తాంతంతో బాటు, అగ్నిహోత్రునికథ, ఉద్దాలక మహర్షికథ, ప్రమీలకథ, కుశలవోపాఖ్యానము, మున్నగు చిన్ని కథలు కూడ కవి వర్ణించినాడు. సందర్భాను సారంగా దీనిలో అచ్చటచ్చట స్తుతి వచనాలు కూడ ఉన్నాయి. సరళమైన గ్రాంథిక శైలితోను, ఎడనెడనుండే సామెతలతోను, అలంకారాలతోను వర్ణనలతోను కూడి యీ వచన కావ్యం సుందరంగా భాసిస్తూ ఉన్నది.

భారత సంబంధి ఐన వచన కావ్యపరంపరలో కళువె వీరరాజు వ్రాసిన మహాభారతాన్ని గురించి చెప్పాలె. క్రీ. శ. 17 వ శతాబ్దంలో మైసూరును

పాలించిన చిక్క-దేవరాయల కాలంలో నివసించిన వాడు వీరరాజు. ఈ కాలంలో మైసూరులో తెలుగు సాహిత్య పోషణకు చక్కని వాతావరణం ఏర్పడిఉండింది. తదనుగుణంగానే మంచి కావ్యాలు తెలుగులో వెలువడినాయి. వీరరాజుకు మహాభారత రచనంలో తుపాకుల అనంతభూపాలుడు సాయం చేసినట్లు తెలియవస్తుంది. ఈ గ్రంథం, నన్నయ మహాభారతానికి అనుసరణకాదు. సంస్కృత మహాభారతానికి ప్రత్యక్షమైన అనువాదం కొన్ని వ్యావహారిక పదాల ప్రయోగం ఉన్నా, శైలి గ్రాంథికంగానే ఉంటుంది. దీర్ఘంకాని వాక్యాలు, భావసారళ్యానికి దోహదాలుగా ఉన్నవి. ఈ భాగం చూడతగి ఉన్నది.

"ఇవ్విధంబునం గ్రోధవివశుండగు పార్థుని ప్రతాపంబునకుందలంకుచు మహీ చక్రంబులు భయంపడియె. దివాకరుండు తేజోవిహీనుండయ్యె. వాయుదేవుండు విసరుటకు వెరచె. చంద్రగ్రహ తారకాగణంబులు, దిశాభాగంబులును ఎట్టివని ఏర్పరింపబడవయ్యె. చరాచరాత్మకంబగు నిఖిల ప్రపంచంబును కలగంబారె"

కవి జీవించిన కాలంలోను, తరువాతి కాలంలోను, ఈ గ్రంథానికి ఉత్తమ ప్రాచుర్యం లభించింది. ఇదే సందర్భంలో తుపాకుల అనంతభూపాలుని ఆనుశాసనిక పర్వము, నారాయణీయమనే వచన శాంతి పర్వము పేర్కొనదగిన గ్రంథాలు.

ఇక రామాయణ సంబంధియైన వచన కావ్యాలు : తెలుగు భాషలోని పద్య రచయితలకువలెనే, వచన కర్తలు కూడ భారతాన్ని అభిమానించినంతగా రామాయణాన్ని ఆదరించలేదు. విజయరంగ చొక్కనాథుడు మధురను పాలించిన కాలంలో శ్యామరాయ కవి అనే వాడు రామాయణమును వచనంలో వ్రాసినాడు. ఈతడు దీన్ని సమగ్రంగా వ్రాసినాడని తెలియవస్తుంది, కాని, నేను ఒక బాల కాండ మాత్రమే చూడకలిగినాను, అది కూడ ముద్రణమునందలేదు. ఈ కవి వైశ్య కులజుడు. షడ్దర్శన పారంగతుడు. కృష్ణయామాత్య పుత్రుడు. సంస్కృతాంధ్ర భాషా కవితా నిర్వాహక సకల విద్యా సారంగతుడు. అసహాయ బిరుదాంకితుడు. తెలుగులో వచన రామాయణం లేని కొరతను తీర్చాలని ఈతడీ గ్రంథాన్ని వ్రాయ బూనినట్లు చెప్పినాడు. ఇతని శైలి ఈ విధంగా వుంటుంది.

"సకల వృక్షము లు, మృగములు, పక్షులు, అన్నియు నిశ్చలములై వర్తిల్లె. ఓ రఘు కులాలంకారా, రాజకుమారా, దిశలన్నియు నిశాంధకారముచే. నాచ్ఛాదితమై మెల్ల మెల్లన సంధ్యయు నతిక్రాంతంబయ్యె. ఇపుడంతరిక్షమున నక్షత్రములు రోహిణ్యాదితారకలచే నిండంబడుచు నేత్రంబుల కరణి భాసిల్లు జ్యోతికణంబుల బోలెభాసిల్లు. ఇపుడు లోకాంధకారంబుల విరయందోయను ధవళిత కిరణుండగుచు చంద్రుండు చంద్రికలచే లోకంబునందు వసియించు." విశిష్టమైన గ్రాంథిక శైలిలో ఈ గ్రంథం ఒప్పారుతున్నది. భారత రచనంలో కళువె వీరరాజుకు తోడ్పడిన తుపాకుల అనంత భూపాలుడు రామాయణాంతర్గత సుందరకాండను రచించినాడు. ఇది సంస్కృత రామాయణానికి తెలుగు అనువాదం. ఇదికూడ ముద్రితం కాలేదు. సరళ గ్రాంథికంలో ఉన్న వచన రచన మిది. తుపాకుల అనంతభూపాలుడే రచించిన విష్ణు పురాణం, మార్కండేయ కథ, పుష్పగిరి తిమ్మన వ్రాసిన భాగవత సారము, మాచనామాత్యుని బ్రహ్మాండ వచనము, వచన గ్రంథ పరంపరలో పౌరాణికములుగా ఉన్నవి.

ఆంధ్ర సాహిత్యాన్ని, అది వచనమైనా, మతము, మొదటినుండి ప్రభావితం చేస్తూనే వచ్చింది. ఈ ప్రభావానికిలోనై అనేక తెలుగు వచన కావ్యాలు రచితమైనాయి. దత్తాత్రేయ యోగి అనునాతడు 'వేదాంత వ్యవహార సారసంగ్రహము'అనే గ్రంథాన్ని రచించినాడు. దాసగోస్వామి 'పరమానంద బోధ ప్రకరణము'ను వ్రాసినాడు. పెద్దరామకవి. 'ప్రభుదేవర వాక్యము'ను కూర్చినాడు. 'వివేక సింధువు' అనే గ్రంథం కాశీ చెన్నబసవేశ్వరునిచేత రచితమైంది. 'వేదాంత వార్తికము' అనే పుస్తకం వ్రాసినవాడు పరమానంద యతి. 'వివేక చింతామణి' కూడ ఈతని కృతియే. ఇదే సందర్భంలో 'క్రిస్తియన్‌వేద కథా సంక్షేపం' 'సృష్టి రహస్యం'అనే క్రైస్తవమత గ్రంథాలను కూడ పేర్కొనవలె. మత సంబంధమైన యీ వచన గ్రంథాలన్నీ క్రీ. శ. 17, 18వ శతాబ్దుల్లో వెలువడి నట్టివే. ఈ గ్రంథాలన్నీ ప్రధానంగా ప్రచార దృష్టి కలిగినవి కూడ. అందుచేత వీటిలో విశేషమైన శైలిని కాని, అలంకారిక రచనను కాని వెదకడం వలన ప్రయోజనం లేదు. సాహిత్యపరంగా చూచినా, వీటి ప్రాముఖ్యం అంతంత మాత్రమే.

చిన్నయ సూరి :

క్రీ. శ. 1857వ సంవత్సరం రాజకీయంగానేకాక, సాంస్కృతికంగా కూడ భారతదేశానికి ముఖ్యమైంది. మనదేశంలో ఈ సంవత్సరంలోనే విశ్వ విద్యాలయ స్థాపన ప్రారంభమైంది. 1857లో విశ్వవిద్యాలయ స్థాపన జరగడం, అందులో తెలుగు భాష పఠనీయం కావడం జరిగింది. దక్షిణ దేశంలో రచిత ములైన వచన గ్రంథాలీనాటికి ప్రచురితంకాలేదు. అందుచేత గ్రాంథికంగాను, సలక్షణంగాను ఉండే వచన రచన విశ్వవిద్యాలయ విద్యార్థుల కావశ్యకమైంది. ఇటువంటి రచనకు పూనుకొన్నవాడు చిన్నయసూరి. అయన 1856లో నీతి చంద్రికను రచించి ముద్రించినారు. చిన్నయసూరికి విశ్వవిద్యాలయంలో ప్రాబల్యం ఉండడంచేత, అతడు గ్రాంథిక భాషభిమాని కావడంచేతను, గ్రాంథి కవచనములు పాఠ్యాలుగా ఉండే అవకాశం లభించింది ఇతడు పంచతంత్రాన్ని పూర్తిగా రచింప బూనినా, రచించినవి మిత్రలాభము, మిత్ర భేదము, మాత్రమే. ఈ నీతిచంద్రిక యితర రచతయిలపై ప్రబలమైన ప్రభావాన్ని కలిగించింది. పరిణామంగా నాటి రచయితలందరు గ్రాంధిక భాషనే ప్రోత్స హించిరి. రాజధానికళాశాలలో ప్రధాన పండితులైన కొక్కొండ వేంకట రత్నం పంతులు గ్రాంథిక భాషోద్యమాన్ని స్థిరీకరించినారు. వీరు 1872 లో విగ్రహమును రచించి ముద్రింపించి పాఠ్యగ్రంథంగా నిర్ణయించినారు, వేంకట రత్నం పంతులుగారే, 1871లో భాషాసంజీవని అనే పత్రికను స్థాపించి గ్రాంథి కభాషా ప్రచారం చేసినారు. 1877 లో వీరు ప్రిన్స్ ఆఫ్ వేల్స్ హిందూ స్థానదర్శనము అనే గ్రంథాన్ని వచనంలో వ్రాసినారు. ఆ విధంగా విశ్వ విద్యాలయంలో గ్రాంధిక వచన గ్రంథాలు వెలువడుతూ ఉంటే, ప్రజాసామాన్యం లో పరమా నందగురువుల కథలు. (1861), తడకమళ్ల వెంకట కృష్ణరావు వ్రాసిన అరేబియన్ నైట్సు కథలు (1862), కంబు ధర చరిత్ర (1866), ఎర్ర మిల్లి మల్లికార్జునుడుగారి చారుదర్వేషుకథలు (1881), చదలువాడ సీతారామశాస్త్రి గారి దక్కను పూర్వకథలు ముఖ్యములైనవి. ఈ కాలంలోనే కొన్ని పౌరాణిక గ్రంథాలు కూడ వచ్చినవి. సుబ్బరాయలు నాయని వారి దశావతార చరిత్ర సంగ్రహము (1861), తిమ్మరాజు లక్ష్మణరాయ కవిగారి మార్కండేయ పురాణ సార సంగ్రహము (1876), శ్రీకూర్మ పురాణ సంగ్రహము (1877) మొదలైనవి. ఈ గ్రంథాలన్నీ సులభగ్రాంథికంలో ఉన్నట్టివే.

## కందుకూరి వీరేశలింగంగారు : 1890 నుండి :

1890 సంవత్సరానికి ముందు వెలువడ్డ తెలుగు వచన కావ్యాల్లో ఆంగ్ల భాషా ప్రభావం కాన్పించదు. కాని 1890లో వీరేశలింగంగారి రచనలు వెలువడి నప్పటి నుండి తెలుగురచనలపై ఆంగ్లభాషా ప్రభావం స్పష్టంగా కాన్పిస్తుంది. 1899 నాటికి వీరేశలింగంగారి రచనలన్నీ సంపుటాలుగా వెలువడినాయి. వారి ప్రభావం చేత సంస్కారవంతులైన అనేకరచయితలు వచన రచనలు చేసినారు. వీరి రచనల్లో శైలీ కాఠిన్యంలేదు. వీరేశలింగం గారితో ప్రారంభమైన ఆధునిక వచన వాఙ్మయం పలుశాఖల్లో విస్తరించింది. ప్రధాన శాఖలను పేర్కొంటాను

నవల అనే ప్రక్రియ ఆంగ్ల భాషాప్ర భావంచేత తెలుగులో ఉద్భవించింది. వీరేశలింగగారికి పూర్వమే, కొక్కొండ వెంకట రత్నం పంతులుగారు 1867లో మహాశ్వేతను. 1872 లో నరహరి గోపాల కృష్ణయ్య సెట్టి రంగరాయ చరిత్రను ప్రచురించినారు. కాని, వీరు వాటిని నవలలుగా పేర్కొననే లేదు. వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్ అనే ఆంగ్ల నవల ఆధారంగా వీరేశలింగంగారు వ్రాసిన రాజశేఖర చరిత్ర ఆనేది ప్రథమ నవలగా ప్రఖ్యాతి నార్జించింది. ఆకాలంలో చింతామణి పత్రికలో నవలలు వెలువడుతూ ఉండేవి. 1893లో ఖండవిల్లి రామచంద్రుడు వ్రాసిన ధర్మవతీ విలాసము, తల్లాప్రగడ సూర్యనారాయణరావు వ్రాసిన సంజీవరాయ చరిత్ర వీటిలో ముఖ్యమైనట్టివి. చింతామణి పత్రికా ముఖంగానే చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు రామచంద్ర విజయమును ప్రచురించిరి. దీనికి చాలప్రచారం కలిగింది, అహల్యాబాయి (1897), కర్పూర మంజరి (1898) అనేవి కూడా వీరి రచనలే,

ఈ కాలంలో కొన్ని చారిత్రక వచనగ్రంథాలు కూడ ప్రచురితమైనవి. బుక్క పట్టణం రాఘవాచార్యులు తెలుగు రాజుల చరిత్రను 1881లో రచించినారు. 1885లో ఒడయరు వీరనాగయ్యగారు చాణక్య చరిత్ర వ్రాసినారు వీరే బెండపూడి అన్నమంత్రి చరిత్ర (1881), తిమ్మరుసు చరిత్ర (1898) అనే వాటిని కూడ రచించినారు.

ఆంగ్ల భాషాప్రభావంతో ఈకాలంలో తెలుగులో వ్యాసాలు, ఉపన్యాసాలు రచింపబడినాయి. 1881లో వెలువడిన వావిలాల వాసుదేవ శాస్త్రిగారి 'ఆంధ్ర

భాషను గూర్చిన ఉపన్యాసము' అనే దాన్ని ముందు పేర్కొనవలె. 189 లో గోపాలరావు నాయుడుగారు. 'ఆంధ్రభాషా చరిత్ర సంగ్రహము' అనే వ్యాసాన్ని ప్రకటించినారు. 1885-1900 మధ్య కాలంలో 'చింతామణి' లో అనేక వ్యాసాలు ప్రచురితమైనాయి. తెలుగులో వాఙ్మయ విమర్శనం అనే ప్రక్రియ కూడ ఆంగ్లభాషాప్రభావంచేత ఉద్భవించినట్టిదే ఈకాలంలో కొన్ని యిట్టి విమర్శలు వెలువడినాయి. చెన్నరాజధానీ కళాశాలలో దక్షిణామూర్తిగారు పింగళి సూరన్నను గూర్చి ఉపన్యసించి 1893లో దాన్ని ముద్రించినారు. 1896లో శ్రీ కొచ్చర్ల కోట రామచంద్ర వేంకట కృష్ణారావు బహద్దరువారు 'ఆంధ్ర భాషాభివృద్ధి' అనే వాఙ్మయము విషయిక వ్యాసాన్ని ప్రచురించినారు. కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి భాస్కరరామాయణ కర్తృత్వము (1898) పెన్నేటి రామ చంద్రరావుగారి 'మనువసు ప్రకాశిక', 'నన్నయభట్టారక చరిత్రము' అనేవి కూడ విమర్శనాత్మక గ్రంథాలే.

వీరేశలింగంగారు స్వయంగా తెలుగు వచన వికాసానికి బహువిధాల తోడ్పడ్డారు వీరు సాహిత్యకులే కాక సంఘ సంస్కర్తలును కావడం చేత. సులభగ్రాంథికంలో ఉండే రచనలు అనేకం చేసి ఉన్నారు. వీరి గ్రంథాల్లో అధికాంశం వచన రచనలే కావడం చేత వీరికి గద్యతిక్కన అనే సార్థకనామం కలిగింది. వీరేశలింగం గారి నవలను గురించి చెప్పినానుకదా. సత్యరాజా పూర్వదేశయాత్రల వంటి కథా గ్రంథాలు, విక్టోరియా జీవిత చరిత్ర వంటి జీవిత చరిత్రలు, స్త్రీత్వవర్తన మొదలైన విషయాలపై వ్యాసాలు, ఆంధ్ర కవుల చరిత్ర వంటి సాహిత్య చరిత్ర, స్వీయ చరిత్ర, మున్నగు గ్రంథాలు చూచి నప్పుడు వారి బహుముఖ ప్రజ్ఞ గోచరమవుతుంది.

## ఆధునికయుగం :

ఆధునికయుగం నిజంగా వచన యుగం అని చెప్పవలసి ఉన్నది. వీరేశలింగంగారు ప్రారంభించిన బహుముఖ రచనము, గిడుగురామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషావాదం, అనే వాటిచే ప్రోత్సాహంచెంది వచన రచన వివిధ శాఖల్లో విస్తరించింది.

ఈరెండు విశేషాలేకాక మనదేశంలో గడచిన 25 సంవత్సరాలలో పత్రికలు బహుజనామోదాన్ని పొందడం, అక్షరాస్యత దేశంలో అధికంకావడం,

మాతృ భాషాబోధనకు ప్రాముఖ్యంరావడం, వంటివి ఈ విస్తరణకు మిగిలిన కారణాలుగా చెప్పవచ్చును

ఆధునికయుగానికి పూర్వం తెలుగు వచన ప్రయోజనం కేవలం కథా కావ్యాలకు మాత్రం పరిమితం అయి ఉండేది. కాని శ్రీ వీరేశలింగంగారు దాన్ని చేపట్టడంతో, నవల, వ్యాసం, విమర్శనం, జీవిత చరిత్ర, సాహిత్య చరిత్ర కథానిక, శాస్త్ర రచన మొదలైన విభాగాలను వచనం ఆక్రమించింది. ఇక కవిత్వ రంగంలో కూడ వచనం తన ప్రయోజనాన్ని నిరూపించుకొంటుంది. అంటే. ఈనాడు ఈరచనా పద్ధతికి ఎంతట విస్తృత ప్రచారం కలిగిందో వేరుగా చెప్పవలసిన అవసరం ఉండదు,

తెలుగుపై ఆంగ్ల భాషా ప్రభావం కలిగి దాని పరిణామంగా ఏర్పడిన రచనల్లో నవల ప్రథమంగా చెప్పదగింది. సమకాలీక విశేషాలను ఉల్లేఖించ డంలో నేమి, చారిత్రకాంశాలను రమ్యంగా చెప్పడంలో నేమి, ఈయుగంలో నవల చాల శక్తిమంతమైన సాధనంగానే వున్నది. స్వాతంత్ర్యానికి పూర్వమే నవలా రచనలో పేరు పొందిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, దాని తరువాత కూడ, నవలా. రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. చారిత్రిక విభాగంలో చూస్తే, వుత్తమకథా విధానాన్ని ప్రదర్శించి, మన పూర్వ సాహిత్యపుటౌన్నత్యాన్ని జ్ఞప్తికితెచ్చేవి శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి నవ లలు. విశ్వనాథవారి నవలల్లో చాలవరకు, నోరివారి నవలన్నీ, సరళ గ్రాంథి కంలో వ్రాయబడ్డ నవలలు గ్రాంథిక భాషలో కూడ నవల చక్కగా వ్రాయ వచ్చును అని వీరి రచనలు నిరూపిస్తున్నాయి.

...సాంఘికమైన వస్తువును గ్రహించి, సమకాలీన జీవితంపై దృష్టిని ప్రసరించినవారిలో శ్రీ బుచ్చిబాబు చెప్పదగినవాడు. ప్రత్యేకశైలి మనస్తత్వ పరిశీలన శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అభిమాన విషయాలు. వారిని అనుసరించే వారీనాడు చాలమంది ఉన్నారు కాని బీనాదేవిని ఈ సందర్భంలో పేర్కొనవలె. ఇదే కాలంలో చాలమంది స్త్రీలు నవలా రచనావ్యాసంగాన్ని చేపట్టి సాధన చేస్తూన్నారు. వీరు రచించిన నవలల ప్రమాణం మాట ఎట్లా వున్నా, పరిమాణం మాత్రం అధికంగానే వున్నది. కౌసల్యాదేవి రంగనాయ

కమ్మ, సులోచనారాణి, ఆనందారామం, మొదలైనవారు ఈ సందర్భంలో పేర్కొనదగి వున్నారు. ఏది ఎట్లావున్నా, వచన తెలుగులో నవల ద్వారా విశేషంగా లోకంలో వ్యాప్తి చెందింది.

ఈ కోవలో పేర్కొన్న రచయితలందరూ వ్యావహారిక భాషనే తమ సాధనంగా ఎన్నుకొన్నారు. బుచ్చిబాబు రచనల్లో ఇంగ్లీషు భాష చదువుకొన్న తెలుగువారు ఉపయోగించే భాష కానిపిస్తుంది. రా. వి శాస్త్రిగారు విశాఖ ప్రాంతంలోని మాండలికాన్ని గ్రంథస్థం చేయడంలో అందె వేసినచేయి. వీనాదేని, ఏ అవకాశమున్నా ఇంగ్లీషు వాక్యాలో, ఇంగ్లీషు పదాలో ప్రాయాలనే అభినివేశం ఉన్నవారుగా కనిపిస్తారు. వీరినవలల్లో కొన్నింటికి ఆంగ్లంలోనే నామకరణం చేసి ఉన్నారు.

ఆంధ్రవచన రచనకు మరొక ప్రధానమైన ఆలంబనంగా ఉన్నది కథానికా రచన. ఆంగ్లభాషా సంపర్కంచేత తెలుగులో ఉద్భవించిన నూతన ప్రక్రియ యిది. యాంత్రికంగా పరిణమించిన యీనాటి సంఘంలో చాల శక్తిమంతంగాను, ప్రచురంగాను ఉన్నది కథానిక. దీని కథావస్తువుగా, జీవితంలోని ఒక సంఘటనను గాని, దానికి సంబంధించిన కొన్ని విశేషాలను గాని స్వీకరించడం సంభవిస్తుంది. ఒక్కొక్కసారి మానవ మనస్తత్వ సంబంధమైన ఏదో ఒక కోణాన్ని ప్రదర్శించడానికి కూడ కథానిక ఉపయోగపడుతూ ఉన్నది. అధిక ప్రచారాన్ని చెందిఉండంచేత, విభిన్న రచయితలు విభిన్న రచనాశిల్పాన్ని అవలంబించి కథానికారచన చేస్తున్నారు. దేశంలో ఉండే, వార, మాస పత్రికలు, కొండొకచో దిన పత్రికలు కూడ, కథానికా ప్రచురణకు స్థానం ఇస్తున్నవి. ప్రేమ, ప్రణయం, దారిద్ర్యం, ధనిక సమాజం, రాజకీయాలు, రహస్య విషయాలు, ఒకటేమిటి, అన్నీ కథానికలలో వస్తువులుగా మారుతూ ఉన్నవి. ఈనాడు తెలుగు దేశంలోని రచయితల్లో కథారచన చేస్తున్నవారే అధికంగా ఉన్నారు అంటే అనుచితంగా ఉండదు.

స్వాతంత్ర్యానికి పూర్వమే కథానికా రచన ప్రారంభించి ఇంకా కొనసాగిస్తున్న రచయిత కొడవగంటి కుటుంబరావు. వీరు సంఖ్యలోను, ప్రమాణంలోను ఆధిక్యాన్ని పొందిన కథానికలను వ్రాసినారు. పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' అనే కథతో, తెలుగుకథ అంతర్జాతీయ ఖ్యాతిని అందు

కొన్నది. బుచ్చిబాబుగారి 'నిరంతరత్రయం', మంచికథల్లో పేర్కొనదగింది. ఇటీవల మధురాంతకం రాజారాం, వాకాటి పాండురంగారావు కూడ మంచి కథలు వ్రాసి ఉన్నారు. ఇస్మాయిల్ వ్రాసిన 'కాశీసీసాలు' అనే కథ శిల్పంలోను, వస్తువులోను ఎన్నిక చెందింది. భానుమతి అత్తగారి కథలు వ్రాసి కథానికను వ్యంగ్యంతో కూడిన హాస్యాన్ని జోడించినారు. రంగనాయకమ్మ, సులోచనారాణి మొదలైన రచయితులు కూడ కథానికా రచన చేపట్టి సమర్థతతో నిర్వహిస్తున్నారు. విశ్వనాథశాస్త్రిగారి కథలు, నేటి కథానికా రచయితలకే ఆదర్శ పంతంగా ఉన్నవి. ప్రభావోపేతమైన మాండలిక భాష, పాత్రలలోని వాస్తవికత, వీరి కథల్లోని ప్రత్యేకతలు. వీరు వ్రాసిన 'సారాకథలు' సంపుంలోని సారాన్ని ప్రదర్శిస్తూ ఉన్నవి. కొలకలూరి ఇనాక్, నవీన్ అనే రచయితలు కూడ మంచి కథలు వ్రాస్తున్నవారే. రచయితలు, రచనలు, అధికంగా ఉండడం చేత, అన్నిటినీ గురించి ఈ రంగంలో చెప్పడం సాధ్యంకాదు.

ఈ రచయితలందరూ, కథానికా రచనకు వ్యావహారిక భాషనే ఉపయోగిస్తున్నారు. వీరిలో చాలమంది సంభాషణోచితమైన భాష కథానికకు జీవం లాంటిదని గుర్తించినవారే. కొందరు రచయితలు వ్యావహారిక భాషపేరుతో, కృత్రిమంగాను, ఒక్కొక్క సారి వికృతంగాను ఉండే భాషను ఉపయోగించకపోలేదు. అయినా, దీనికి బలం వస్తువు కావడం చేత, పాఠకులు అంతగా పట్టించుకొన్నట్లు కాన్పించదు. ఏది ఎట్లాఉన్నా, వ్యావహారిక భాష, కథానికనూ, తదంతర్గత పాత్రలను, పాఠకులకు సన్నిహితం చేయగలిగిందనడంలో సందేహం లేదు.

ఆధునిక కాలంలో వ్యాస రచనలో కూడ కొంత కృషి జరిగింది. వీరేశలింగంగారు వ్రాసిన వ్యాసాలే కాక, పానుగంటివారు వ్రాసిన సాక్షి వ్యాసాలు ఆరు సంపుటాలుగా వెలువడినాయి. ఇవి వివిధవస్తు భరితమైనట్టివి. సామాజిక విశేషాలను నిశితంగా వ్యంగ్యంగా, ఒక్కొక్కసారి హాస్య భరితంగా విమర్శించేవి. ఇటువంటి వ్యాసాలు తిరిగి తెలుగులో ఇంకా వెలువడలేదనడంలో సందేహంలేదు. తరువాతి కాలంలో వివిధశాస్త్రాలకు, కళకు చెందిన వ్యాసాలు వెలువడినాయి కాని, సాహిత్య విమర్శకు సంబంధించిన వ్యాసాలే ఈ కాలంలో అధికం. రాజకీయమైన వ్యాసాలను వివిధ పత్రికలు ప్రకటిస్తూనే ఉన్నవి కాని,

వాటికి శాశ్వత ప్రయోజనం తక్కువ. సాహిత్య పరమైన వ్యాసాల్లో రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి సారస్వతాలోకం ముందు పేర్కొనదగింది. వివిధ రచయితల వ్యాస సంకలనమైన మహా భారతోపన్యాసాలు అనేదాన్ని ఉత్తమ సారస్వత వ్యాస సంపుటిగా పేర్కొనవలె.

ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ మొదలైన సంస్థలు రచయితలను ప్రోత్సహించి వ్యాసాలను ప్రచురిస్తున్నాయి. సాహిత్యం మీద అభిమానం ఉన్నవారినే అధికంగా ఈ వ్యాసాలు ఆకర్షిస్తాయి కాబట్టి, వీటికి పాఠకుల సంఖ్య తక్కువే అయినప్పటికీ, మంచి వ్యాసాలే వచ్చినవని నిస్సందేహంగా చెప్పవచ్చు ఏవోకొన్ని సందర్భాలలో తప్పిస్తే, పుస్తక రూపంలోను, పత్రికాముఖంగాను వచ్చే వ్యాసాలన్నీ గ్రాంథిక భాషామయంగానే ఉన్నాయి. రాళ్లపల్లివారి వ్యాసాలు గ్రాంథికమే అయినా, చెప్ప వలసిన అంశాలను క్లిష్టత లేకుండా తేటపరుస్తునాయి. ఇతర రచనలు కూడ ఆ విధంగానే ఉన్నవి. కొంత సాహిత్య వాసనకలిగి, అందులోని బాగోగులను పరిశీలించే వారికే ఈ వ్యాసాలు నిర్దేశింపబడడం చేత వీటి భాష గ్రాంథికంలో ఉంటూ వున్నది. విద్యార్థులు గ్రాంథిక భాషాధ్యయనం చేయడానికి, ఈ వ్యాసాలు చక్కగా ఉపకరిస్తున్నాయి

ఈ కాలంలో సాహిత్య విమర్శక గ్రంథాలు కూడ వెలువడినవి. ఆధునిక పద్ధతుల్లో మొదట సాహిత్య విమర్శకు పూనుకొన్నవారు కట్టమంచి రామలింగారెడ్డిగారు. వీరి కవిత్వతత్త్వ విచారము అనే గ్రంథం ఆధునిక సాహిత్య విమర్శకులకు ఒజ్జబంతి అయింది. సర్వతోముఖ ప్రజ్ఞ కలిగిన విశ్వనాథ సత్యనారాయణగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి కూడ ఇపుడే వెలువడింది. నన్నయగారి కథాశిల్ప రమ్యతను బహుముఖంగా ప్రదర్శించే గ్రంథమిది. వారిదే 'అల్లసానివారి అల్లికజిగిబిగి'అనేది. దీనిలో ప్రథమ ప్రబంధంలోని వన్నెచిన్నెలు విశేషంగా విస్తరింపబడినాయి. ఆధునిక సాహిత్యంపై కూడ మంచి విమర్శవెలువడింది. రమణారెడ్డి, ఆర్ ఎస్. సుదర్శనం, సుప్రసన్న మొదలైనవారీ రంగంలో కృషి చేస్తున్నారు. యువభారతి అనే సంస్థ ఇటీవల వెలువరించిన లహరీ పరంపర ఉత్తమ విమర్శక సాహిత్యంగా వున్నది ఇది

కాక, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు, శేషాచలం కంపెనీవారు· ప్రచురించిన విభిన్న ప్రాచీన కావ్యాలకు విజ్ఞులు. విమర్శనతో కూడిన పీఠికలను వ్రాసినారు. ఈ పీఠికలు ఆంధ్ర విమర్శన సాహిత్యాన్ని సుసంపన్నం చేసినాయి. ఈ విమర్శనశాఖలోని భాష అధికాంశం గ్రాంథికంగా వుంటున్నది.

ఆధునిక యుగంలో చరిత్ర గ్రంథాలు కూడ వచ్చినవి స్వాతంత్ర్యా నంతర కాలంలో ఇవి మరికొంచెం అధికంగా వెలువడినవి శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం గారలు కలిసి వ్రాసిన 'ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి'అనే గ్రంథం, మన సాంస్కృతిక చరిత్రను చెప్పే ప్రథమ గ్రంథం. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' కూడ ఈ కోవలో చేరినట్టిదే. ఇది రాజుల చరిత్రను కాక, ప్రజాజీవిత విధానాలను వివరించేదిగా వున్నది. సాహిత్య చరిత్రల్లో ఖండవల్లివారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము' దివాకర్లవారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' పేర్కొనదగినవిగా వున్నవి. చాగంటి శేషయ్యగారు వ్రాసిన 'ఆంధ్ర కవితరంగిణి'అనేక సాహిత్య చారిత్రకవిశేషాలను వెల్లడించేదిగా వున్నది. ఇదే దిశలో శ్రీ ఆరుద్ర 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'ద్వారా మంచికృషి చేసినారనే చెప్పవలె. మధునాపంతుల సత్యనారాయణగారి 'ఆంధ్ర రచయితలు'అనే గ్రంథం పేర్కొనదగింది.

స్వాతంత్ర్యనంతరం ఆంధ్రదేశంలోని విశ్వవిద్యాలయాలు సాహిత్య పరిశోధనను తగినంతగా ప్రోత్సహించడంతో, కేవలం కొందరు పండితులకు మాత్రమే పరిమితంగా వుండిన సాహిత్య పరిశోధన విస్తృతరంగంలో అడుగుపెట్టింది. ఆధునిక పద్ధతుల్లో, శాస్త్ర బద్ధంగా వున్న పరిశోధన విశ్వవిద్యాలయాలలో కొనసాగింది. యువకులైన పరిశోధకులు అనేకులు' సాహిత్యాన్ని మథించి, ఉత్తమ సిద్ధాంత వ్యాసాలు వ్రాసి ప్రకటించినారు.

సాహిత్య చరిత్రలు, పరిశోధన గ్రంథాలు, విషయవైశద్యం ప్రధానంగా కలిగినట్టివి. పరిమితమైన పాఠకులను కలిగినట్టివి. అందుచేత ఈ గ్రంథాలను వ్రాసిన రచయితలు, సరళగ్రాంథిక భాషనే తమ రచనలకు ఉపయోగించినారు. ఇందలి భాషయెట్లా వున్నా, వీటి ప్రయోజనానికి ఏమీ

లోపం కలుగలేదు ఇంకా భవిష్యత్తులో వీటికి ప్రయోజనం అధికంగా వుంటుంది.

ఈ రెండు మూడు దశాబ్దుల కాలంలో తెలుగు వచనంలో శాస్త్రరచన కూడా తగినంత జరిగింది. ఇంతకు పూర్వమే విజ్ఞాన సర్వస్వం సంకలనం చేయడానికి ఒకటి రెండు ప్రయత్నాలు జరిగినవి కాని, అవి అంతగా ఫలవంతములు కాలేదు. స్వాతంత్ర్యానంతర కాలంలో ఈ రంగములో మంచి కృషి జరిగింది. ఉత్తమ గ్రంథాలు వెలువడినాయి. తెలుగు భాషా సమితివారు వివిధ సాంఘిక శాస్త్రాలపైననూ, ప్రకృతి శాస్త్రాలపైననూ, వ్యాసాలతో కూడిన సంపుటాలు విజ్ఞానసర్వస్వం అనే పేరుతో వెలువరించినారు. ఇవి విజ్ఞానానికి చెందిన వివిధ రంగాల్లో విషయ వైశద్యం కలిగి ఉన్నవి. ఆయా శాస్త్రాల్లో నిష్ణాతులైన రచయితలు, సంపాదకులు ఈ గ్రంథ రచనలో పాల్గొన్నారు. ఇదే దిశలో మరో ప్రయత్నం జరిగి మరొక విజ్ఞాన సర్వస్వం "సంగ్రహ విజ్ఞాన కోశము" అనే పేరుతో వచ్చింది. ఎనిమిది సంపుటాలలో వివిధ విషయాన్వితమైన యీ "సంగ్రహ కోశము" సరళ గ్రాంథికంలో రచితమై ఉత్తమ శాస్త్ర గ్రంథ రచనకు ప్రతీకగా ఉన్నది. భాషా సమితి వారి గ్రంథంలోవలె విషయక్రమాన్నిబట్టి కాక, అకారాదిగా విషయ వివరణ దానిలో ఉన్నది. ఈ రెండు విజ్ఞాన సర్వస్వాలను దాదాపు ఒకే కాలంలో తెలుగు దేశానికి అందించిన సంస్థలు అభినందించదగినవి. వీటిలో తెలుగుభాషాసమితి వారు ప్రచురించిన సంపుటాలలో శిష్టవ్యావహారిక భాషనే ఉపయోగించినారు. వివిధ విషయాలను వ్యావహారికంలో సుగమంగా చెప్పడంలో వీరు కృతకృత్యులైనారనే చెప్ప వలసి ఉంటుంది.

తెలుగులో ఉన్నత పాఠశాలల వరకు మాత్రమే ఇదివరకు విద్యాబోధన అనుమతింపబడడం చేత. ఆయా శాస్త్రాల్లో ( ప్రకృతి, సాంఘిక ) ఉన్నతదశలోని విజ్ఞానానికి చెందిన గ్రంథాలు అంతగా అవసరం అనిపించలేదు. కాని యిటీవల ప్రభుత్వం కళాశాల స్థాయిలోను తెలుగును బోధనా భాషగా ప్రవేశ పెట్టడంతో ఆ శాస్త్రగ్రంథాల ఆవశ్యకత ఏర్పడింది. ఈ అవసరాన్ని తీర్చడానికి ప్రభుత్వం పూనుకొని, తెలుగు అకాడమీ అనే సంస్థ

ద్వారా తెలుగులో శాస్త్ర గ్రంథాల ప్రచురణ చేయించింది స్వల్పకాలంలోనే కళాశాల స్థాయికి ఉపకరించేవి. సాంఘిక, వాణిజ్య, ప్రకృతి శాస్త్రాల్లో అనేక ఉత్తమ గ్రంథాలు వచ్చినాయి. ఆయా విషయాల్లో నిపుణులైన విశ్వ విద్యాలయాది సంస్థల్లో బోధిస్తున్న విద్వాంసులు ఈ గ్రంథాలను రచించడం ఎంతో సముచితంగా ఉన్నది: ఈ గ్రంథాల్లో వచన రచన శిష్ట వ్యావహారికంలో జరుగుతూ ఉన్నది విద్యార్థులకు భాష సుగమం కావలెనని కాబోలు, రచయితలూ, ప్రచురణ కర్తలూ, వ్యావహారిక శైలినే ప్రోత్సహిస్తూ ఉన్నారు. మరి కొంత కాలంలోనే వివిధ విషయాలకు చెందిన అనేక మంచి గ్రంథాలను తెలుగు అకాడమీ రచింపచేసి, అనువాదం చేయించి ప్రచురిస్తుందని ఆశించవచ్చు.

ఈ కాలంలో తెలుగు వచన రచన ఎంతగా ప్రాచుర్యం పొందిందీ అంటే పైన పేర్కొన్న ప్రక్రియలేకాక, కవిత్వం కూడా వచనాన్ని ఆశ్రయించింది. ఆ విషయాన్ని ఇచట ప్రస్తావించి చర్చించడం నా పని కాదనుకొంటాను.

పరిశీలనలో ఉన్న కాలంలో వచన రచనకు అనుసరించిన భాషలో చాల పరివర్తనలు కలిగినవి. గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన ఆ వ్యావహారిక భాషా ఉద్యమం అధిక ప్రచారాన్ని పొందింది. నవల, కథానిక వంటి సృజనాత్మక సాహిత్యాన్ని వ్యావహారిక శైలి పూర్తిగా ఆక్రమించింది. ఇప్పటికీ విశ్వనాథ వంటి వారు కొందరు, కొన్ని నవలలను గ్రాంథికంలో వ్రాస్తూ ఉన్నా, కొన్ని సందర్భాలలో వారు కూడ ఆ నియమాన్ని సడలించుకొన్నారు, ఇక ఇతర రచయితలు వ్యావహారిక భాషనే అనుసరిస్తున్నారు. సాహిత్య పరిశోధనలు, విమర్శనలు చేసేవారు ఇంకా సరళ గ్రాంథికాన్నే ఉపయోగిస్తున్నారు. ఇటీవల వచ్చిన శాస్త్ర గ్రంథాలు వ్యావహారిక భాషలో ఉన్నాయని చెప్పినాను కదా.

వచన రచన వ్యావహారిక శైలిలో జరగడంలోని కొన్ని సాధక బాధకాలను ఇచ్చట చర్చించడం అనుచితం కాదనుకొంటాను. భాషలోని లోతుపాతులు తెలిసి, పండితులైన వ్యుత్పన్నులు వ్యావహారిక భాషలో రచనలు చేసినా, దానిలో ఉండే గాంభీర్యానికి అర్థ పుష్టికి, విఘాతం కలుగదు. కాని, విపరీతమేమంటే భాష వ్యావహారికమేకదా, అని, అవ్యుత్పన్నులు, ఈ నాడు

రచనావ్యాసాంగానికి పూనుకొంటున్నారు. భాష, భావానికి వాహకం కావడం చేత వీరి రచనల్లో భాషకూ, తద్వారా భావానికీ విఘాతం కలుగుతూవున్నది. మనకు రాజకీయ స్వాతంత్ర్యం రావడంతో స్వేచ్ఛను పొందినామని సంతోషిస్తున్నాం. కాని, ఈ స్వాతంత్ర్యానంతర కాలంలో భాషాపరంగా మరింత పారతంత్ర్యానికి గురి అయినాము. ఈ నాడు వెలువడే నవలల్లో, కథల్లో ఎంత ఎక్కువ ఇంగ్లీషు భాష కలిపి వ్రాస్తే అంత గొప్ప అనుకొని వ్రాస్తున్నారు నేటి రచయితలు, రచయిత్రులు. ఇప్పుడు వెలువడుతున్న ఏ వార పత్రికను తిరగవేసినా ఈ విషయం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తుంది ఎన్నో నవలల పేర్లు, కథానికల పేర్లు ఇంగ్లీషులోనే వుంటున్నాయంటే, భాషాపరంగా మనం ఎంత పారతంత్ర్యానికి వశమైనామో తెలియవస్తుంది. ఈ పరిణామం, ఏ భాషకూ ఆరోగ్యప్రదం కాదు. మన రచయిత(త్రి)లకు ఇంగ్లీషు మీద అభినివేశం వుంటే, ఇంగ్లీషు రచనలు చదవడం, అదే భాషలో వ్రాయడం చేయవచ్చు. కాని భాషా సాంకర్యం మంచికి దారి తీయదనడం యదార్థం. హిందీ తమిళం వంటి యితర దేశ భాషల్లో ఈ వింత పరిణామం లేనేలేదు. మన రచయిత(త్రు)లు ఎంత త్వరగా ఈ అలవాటును వదిలితే అంత మంచిది. ఇది వ్యావహారికభాషలోని హేతువాద దృష్టిని అర్థం చేసుకోక పోవడం చేత, వచ్చిన వికృత పరిణామమనడంలో సందేహం లేదు.

ఇక ఉన్నత విద్యకు విధించిన పాఠ్యగ్రంథాలు వ్యావహారిక భాషలో వుండడంలోని మంచి చెడులను గురించి చెప్పవలె. సరళమైన భాష, అధ్యయనం చేస్తున్న విషయాన్ని సుగమం చేస్తుందనడంలో విప్రతిపత్తి లేదు. కాని, యిది విధిగా వ్యావహారికంలోనే వుండాలనే నియమం లేదు. గ్రాంధికమై నిరలంకారమైన తెలుగులోనే సరళ భాషను రూపొందించవచ్చు. ఈ భాష సర్వసామాన్యంగా వుండి అందరికీ ఆమోదయోగ్యం అవుతుంది. అట్లుకాక వ్యావహారికంలో కొన్ని మాండలికశబ్దాలు కొన్ని రూపాలు చేరడం తప్పదు. అవి ఇతర మండలాల వారికి అర్థగ్రహణంలోను ఉచ్చారణలో నుసులభంగా వుండవు. ఒక ప్రాంతపు మాండలిక పదాలను, వేరొక మండలంవారు విధిగా అభ్యసించడం సంభవిస్తున్నది. పైగా ఈ వ్యావహారిక భాషాభ్యాసంవల్ల విద్యార్థికి రచనలో ప్రామాణికమైన స్థూల దృష్టి ఏర్పడడం లేదు. అందుచేత, ఇతర సోదర దేశీయ భాషల్లో వలె మనంకూడా పాఠ్యగ్రంథ రచనలో సరళ గ్రాంథిక శైలినే అనుసరిస్తే, విద్యార్థులకు, రచయితలకు మేలు చేకూర్చిన వారమవుతాము.

# 'దేశ భాషలందు తెలుగు లెస్స'




## ప్రపంచ తెలుగు మహాసభలు

**1975, ఏప్రిల్ 12–18**